5486

# అనుభవ మంటపం

డా॥ ముదిగొండ శివప్రసాద్

(రెండవ భాగం)

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడ్డ ఇరవై ఏడవ నవల

విజయ
30. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

97

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 30
June 1978
'ANUBHAVA MANTAPAM' (II nd Part)
BY Dr. MUDIGONDA SIVAPRASAD

వెల: చెల్లింపలేనిది.

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)

అన్ని హక్కులూ రచయితవి.

ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
8- ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

98

IPL0133M135 5766
1753

# అనుభవ మంటపం

## (రెండవ భాగం)

బసవేశ్వరుని పడక గది:

గంగాంబిక గుడ్డతో చూరుకు ఒక ఉయ్యాల వేసి అందులో బాలసంగయ్యను ఊపుతూ జోలపాట పాడుతున్నది.

బాలసంగయ్య నిద్రపోయాడు. గోరువెచ్చని పాలు చల్లబడ్డాయి. అయినా బసవన్న ఇంకా గది లోపలికి రాలేదు. భర్తకోసం అలా ఎదురుచూస్తూ ఎదురుచూస్తూ కొడుకుకు జోలపాడుతూ నిద్రపోవడం గంగాంబికకు మామూలే.

ఇంటిముందు భాగంలో బసవన్న ఎవరితోనో ఏవో విషయాలు చర్చిస్తున్నాడు. ఒకరు అయిపోతే మరొకరు వస్తున్నారు.

బసవన్న ప్రతిదినమూ లక్ష తొంభై ఆరువేల మహేశ్వరులకు అర్చనచేసి, వారు భుజించిన తరువాతనే తాను ప్రసాదం ఆరగిస్తాడు.

రేపటి అర్చనకై సంభారాల ఏర్పాటుగూర్చి వచ్చే వారు కొందరు, రాజకీయ వ్యవహారాలు చర్చించే వారు కొందరు, మత విషయాలు ముచ్చటించే వారు కొందరు, దర్శనం చేసుకొని పోదామని వచ్చేవారు కొందరు- ఇలా అర్ధరాత్రి వరకూ ప్రజలు వస్తూనే వుంటారు, బసవన్న వారితో మాట్లాడుతూనే వుంటాడు.

ఉన్న చర్చలతో బాటు ఇప్పుడు యుద్ధ సమస్య కూడా వచ్చింది.

యుద్ధం చేయవలసివస్తే సమ్మె చేస్తామని అంటున్నారు ఉత్పత్తిదారులైన కుటీరపరిశ్రమల అధిపతులు.

సైన్యం సుముఖంగా లేదు. ప్రజలలో ఆందోళన.

శీలవంతుడు వచ్చి ఈ విషయాలన్నీ బసవన్నతో చెప్పాడు.

"బాబుగారూ! యుద్ధానికి జాతి వ్యతిరేకంగా వుంది. మీరు యుద్ధాన్ని నివారించాలి" అన్నాడు శీలవంతుడు.

బసవన్న చిరునవ్వు నవ్వి శీలవంతుణ్ణి పంపివేశాడు.

శీలవంతుడు శాంతియుతంగా జనాందోళనకు ప్రయత్నాలు చేస్తున్నట్లు బసవన్న గ్రహించాడు.

మొగసాలపై గడియారం మూడవ యామాన్ని సూచించింది.

బసవన్న పడకగదిలోకి వచ్చాడు. గంగాంబిక దీపపు వెలుగులో ఏదో చదువుకుంటున్నది.

"గంగా! ఇంకా నిద్రపోలేదా?" అన్నాడు బసవన్న.

"లేదు. నాయనార్ల కథలు చదువుతూవున్నాను" అన్నది చిరునవ్వుతో గంగాంబిక.

"క్షమించు గంగా! నావల్ల నీకు సుఖం లేకపోతున్నది" అని ఆవుపాల పాత్రను అందుకున్నాడు.

"ఎంతమాట! మీ నీడను నేను" అన్నది గంగ.

"నిజమే! దీపం లోకానికంతా వెలుగునిస్తుంది కాని. తనకింద వున్న చీకటిని దూరం చేయలేదు" అన్నాడు బసవన్న పాన్పుపై పవ్వళిస్తూ.

"ఇవ్వాళ మీరెందుకో బాగా అలసిపోయినట్లున్నారు" అన్నది గంగాంబిక.

"అలసట శరీరానికే గాని మనస్సుకు ఆత్మకూ లేదుగా?"

"నిజం చెప్పాలంటే మంగళవాడలో వున్న కాలంలోనే ఎంతో సుఖంగా వున్నారు. కల్యాణ్ వచ్చినప్పటినుంచి విధీ విరామం లేని రాజకీయాలు" అన్నది గంగ.

"గంగా! రాజకీయాలు రాజకీయాలకోసం కాదు- మానవుని సర్వతో ముఖాభివృద్ధికీ, వికాసానికీ కావలసిన ఒక సమాజికి వ్యవస్థలో రాజకీయం ఒక అంగం. అది సర్వస్వమూ కాదు. రాజకీయాల వల్ల శివకార్యం నేను చేయగలిగితే నా కప్పుడు రాత్రింబవళ్ళూ రాజకీయాలే తపస్సు, రాజకీయాలే ధ్యానం" అన్నాడు బసవన్న.

గంగాంబిక శ్రీపట్టుచీరె ధరించింది. సరిపట్టురవికె దాల్చింది. బసవేశ్వరుని పాదసేవ చేస్తూ అలా కబుర్లు చెపుతూవున్నది. గంగాబిక మాటలతో భర్తను నిద్రపుచ్చాలని ప్రయత్నిస్తున్నది.

గంగ మాటలు ముగియవు. బసవనికి నిద్రరాదు.

"సంగణ్ణి నిద్రపుచ్చానుకాని, మిమ్మల్ని మాత్రం నేనిక నిద్రపుచ్చలేను" అన్నది గంగ కొంటెగా.

"ఇలా పడుకో గంగా- నిద్ర దానంతట అదే వస్తుంది" అని భార్యను పడుకోమన్నాడు.

గంగాంబిక బసవన్నకు ఏకాంతసేవ ముగించి పడుకున్నది. క్షణంలో ఆమెకు నిద్రపట్టింది.

బసవన్న మాత్రం నిద్ర పోలేదు.

ఆయన కళ్ళ ముందు బిజ్జలుడు చేస్తున్న యుద్ధ సన్నాహాలు కన్పడుతున్నాయి.

కాకతీయ సామ్రాజ్యంపై బిజ్జలుడు యుద్ధం ప్రకటిస్తున్నాడు. "మూడవ తైలపుణ్ణి కాకతీయ ప్రోలరాజు బందీ చేశాడు కాబట్టి. నా రాజును నేను విడిపించుకొని వచ్చి- భరతుడు రామునికి రాజ్యం అప్పజెప్పినట్లు, ఈ కల్యాణ రాజ్యాన్ని తిరిగి తైలపునికి అప్పజెప్పాలి-అందుకే యుద్ధం" అంటున్నాడు బిజ్జలుడు.

బిజ్జలుడు తన పదవిని అంత తేలికగా వదిలేందుకు సిద్ధంగా లేడని బసవన్న గ్రహించాడు.

మరి ఈ యుద్ధ సన్నాహాలు ఎందుకు?

ప్రోలరాజు బందీలోని తైలపుణ్ణి పట్టుకుని తనకు శత్రు శేషం లేకుండా చేసుకుందామనా?

బసవన్న విచిత్రంగా నవ్వాడు.

"స్వామీ, కూడల సంగమేశ్వరా!" అన్నాడు బసవన్న.

గంగ ఉలికి పడి లేచింది.

"గంగా-గంగా! పడుకో."

"అదేమిటీ! మీ రింకా నిద్రపోలేదా?" అన్నది గంగాంబిక అటు ప్రక్కకు దొర్లుతూ.

"నాకు నిద్ర ఏమిటి గంగా? నిశాచరుణ్ణి" అన్నాడు బసవన్న నవ్వుతూ.

"ఔను మరి- నందీశ్వరులవారు తెల్లవార్లూ శివతాండవం దర్శిస్తుంటారు కదూ- భూమి మీద నుంచే."

బసవన్న నవ్వాడు.

బసవ శబ్దం వృషభ శబ్ద భావం. బసవన్న నందికేశ్వరుని అవతారమని కల్యాణ నగరంలో అందరికీ ఏకాభిప్రాయం వుంది.

"మిమ్మల్ని నారాయణా క్రామిత విమర్శిస్తున్నాడట. కేశవ పెద్ది, వాసుదేవయ్య మీ గూర్చి బిజ్జలునితో లేని మాటలు చెపుతున్నారట" అన్నది గంగాంబిక నిద్ర మత్తులోనే.

"ఔను గంగా! నాకీ సంగతి తెలుసు. అందుకే వారంటే నాకు ప్రేమ. నిజం చెప్పాలంటే నీ కన్నా బాలసంగయ్య కన్నా నారాయణయ్యనూ, కేశవపెద్దినీ ఎక్కువగా ప్రేమిస్తాను. గంగా! ఈ సృష్టిలో ప్రతివాడూ నన్ను ఇంత వాడివనీ అంతవాడివనీ పొగిడే వాడే తప్ప, నన్ను విమర్శించి నా లోపాలు ఎత్తి చూపే జన్మ

జనకులు ఏరి గంగా? నన్ను ఎవరైనా విమర్శిస్తే వారు నాకు తల్లి దండ్రులతో సమానం.” ఇటు తిరిగి చూచాడు బసవన్న.

గంగాంబిక నిద్రపోయింది.

బసవన్న కూడా కన్నులు మూసుకున్నాడు.

కన్నుల మీద వెలుగు- తల చుట్టూ తేజస్సు చక్రం వలె వ్యాపించింది.

బసవన్న నిద్రిస్తున్నాడో, యోగ సమాధిలో వున్నాడో తెలియని దశ.

ఇంతలో 'దొంగ-దొంగ' అని పెద్దగా అరుపులు వినిపించాయి. గంగాంబిక త్రుళ్ళిపడ్డది.

బాలసంగయ్య ఏడవడం మొదలుపెట్టాడు. బయట భటుల పరుగులు.

అరుపులు- “దొంగ- అడుగో- అడుగో- దొంగ- దొంగ- పట్టు కోండి. ఆఁ-ఆఁ-దొరికాడు-దొరికాడు.”

దొంగను కొడుతున్న శబ్దం.

బసవన్న పాన్పు మీది నుంచి లేచి గది బయటకు వచ్చాడు. సైనికులు భయపడిపోతున్నారు.

ప్రధానమంత్రి ఇంట్లో దొంగతనమా? ఇక తాముండి ప్రయోజన మేమిటి? దేశానికి రక్షణ ఏమిటి?

“ఎవడు వీడు?”

“ఎక్కడో చూసినట్లుండే ముఖం?”

“బసవన్నగారి వద్దకు తీసుకుపోవడమెందుకు? మనమే చీల్చేద్దాం వీణ్ణి.”

“నిజం చెప్పరా గాడిద కొడకా! ఎవరు నీవు?”

బయట కలకలం.

"బసవన్నగారు లేస్తారేమో! సద్దు-సద్దు" అంటున్నాడొక రక్షక భటుడు.

"లేచాను-నేను. ఎవరా దొంగ? ఇలా తీసుకురండి" అన్నాడు బసవన్న.

దొంగ గజగజ వణికిపోతున్నాడు.

బసవన్న దొంగను పరిశీలించి చూచాడు.

"నీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు బసవన్న. శూలాలతో చుట్టూ సైనికులు.

"కెంపరాయుడు." వణికిపోతూ చెప్పాడు దొంగ.

"కెంపరాయా! దొంగతనం ఎందుకు చేశావు?" బసవన్న ప్రశ్నించాడు.

"ప్రధానమంత్రీ! చెరుకును గానుగలో వేస్తే కాని రసం ఇవ్వదు. మాటలలో వీడు దోవకు రాడు. తమరు విశ్రమించండి. వీడి సంగతి మేము చూచుకుంటాము" అన్నాడొక సైనికుడు.

"కెంపరాయా! దొంగతనం నీ వృత్తియా?"

"ఔను. కనకశక్తి చోరశాస్త్రం అధ్యయనం చేశాను" అన్నాడు కెంపరాయుడు వణికిపోతూ.

"మా ఇంట్లో నీవు దొంగిలించడానికి ఏముంది కెంపరాయా?" అన్నాడు బసవన్న నవ్వుతూ.

కెంపరాయుడు భయంతో తన వస్త్రం చాటునుండి ఒక పళ్ళాన్ని తీశాడు.

శివపూజా సమయంలో ప్రతినిత్యమూ ఈశ్వరునికి హారతి నిచ్చే పళ్ళెమది.

సైనికులు వీరభద్రులైనారు. కత్తులపై శూలాలపై వాళ్ళ చేతులు పడ్డాయి.

బసవన్న 'ఊ' అంటే చాలు- అక్కడికక్కడే కెంపరాయుణ్ణి నరకడానికి సిద్ధంగా వున్నారు సైనికులు.

"సంగమేశ్వరా!" అన్నాడు పెద్దగా బసవన్న. "సంగమేశ్వరా! నియమభంగం చేశాను తండ్రీ!" అన్నాడు పెద్దగా బసవన్న. ఆయన కంఠం రుద్ధమైంది.

గంగాంబిక గదిలోనుండి లేచివచ్చింది- "ఏమైంది? ఏమిటి?" అంటూ.

"గంగా! నేను ప్రతిజ్ఞను నెరవేర్చలేదు గంగా.

'పట్టులోన ఒక పోగును దాచను

చిన్నమెత్తు బంగారము దాచను

నీ విచ్చిన ధనమెల్లను నీదే

నీ సేవ వినా నేనర్పించిన

నీ పాదాంబుజ సాక్షి నిక్కమిది

స్వామీ కూడల సంగమదేవా' అని లోగడ నేనొక వచనం చెప్పాను. పట్టులో ఒక పోగును దాచననీ చిన్నమెత్తు బంగారం దాచననీ ప్రతిజ్ఞ చేశాను.

"కాని గంగా! నా ప్రతిజ్ఞ వ్యర్థమైంది. ఇదిగో శివారాధనకై ఒక వెండి పళ్ళెం నా పూజామందిరంలో దాచుకున్నాను. అందుకే సంగమేశ్వరునికి కోపంవచ్చి 'మాట తప్పావురా బసవన్నా!' అని తన వెండి పళ్ళెం తాను తీసుకొని పోయి సమాజానికి సమర్పణ చేస్తున్నాడు గంగా!" అన్నాడు గద్గదకంఠంతో బసవన్న.

గంగాంబికతో బాటు సైనికులంతా నివ్వెరపోయారు.

కెంపరాయడు స్థాణువై నిలబడ్డాడు.

"బాబుగారూ!" ఒక సైనికుడు బసవన్నను పలకరించాడు.
"ఇదేమిటండీ?" అన్నది గంగాంబిక.

"ఔను గంగా! దొంగ కెంపరాయుడే కాదే-నేను. నేనే దొంగను గంగా! నీ శరీరం మీది శ్రీవన్నియ పట్టుచీరె నా దొంగ తనానికి చిహ్నం. పూజా మందిరంలోని ఈ వెండిపాత్ర నా ప్రలోభా నికి నిదర్శనం.

"సమాజ ధనం వెండి రూపంలో నా ఇంట్లో కూడ బెట్టానే గంగా! ఇంక నేనేమి శివభక్తుణ్ణి? నన్ను కూడల సంగమేశ్వరుడు క్షమిస్తాడా గంగా?

"నా ఇంట్లో రజితపాత్ర ఉండబట్టే కదా కెంపరాయనికి దొంగతనం చేయాలనే బుద్ధి కలిగింది. నా ఇంట్లో ఆ పాత్రలేకున్న ట్లయితే కెంపరాయనికి ఈ పాపసంకల్పం కలిగి వుండేది కాదు గదా!

"ధనాన్ని నేను కూడ బెట్టబట్టే కెంపరాయనికి నేడు చెడు తలంపు కలిగింది. ఒక వ్యక్తికి చెడు బుద్ధి కలిగేందుకు కారణమైన నా కిక ఏమి శిక్ష విధిస్తావు సంగమేశ్వరా?"

"బాబుగారూ!...." భోరు భోరున ఏడుస్తూ కెంపరాయడు బసవేశ్వరుని పాదాలపై పడ్డాడు.

"బసవదేవా! తండ్రీ! నా పాపాన్ని ఈ కన్నీళ్ళతో ప్రాయ శ్చిత్తం చేసుకోని నీ పాదాలు కడిగి. వెయ్యి ఉరిశిక్షలు వేసినా తీసుకు రాలేని పరిణామాన్ని నా మనస్సులో క్షణంలో శాశ్వతంగా తెచ్చావు బసవా, నీ త్యాగం చేత. తండ్రీ! నేను వృత్తి రీత్యా దొంగనే కాదు, ప్రవృత్తి రీత్యా కూడా దొంగనే.

"ఎవరిని సాక్షాత్తూ భూలోక దైవమని మానవాళి మొత్తం నేడు పూజిస్తున్నదో, ఆ భగవంతుని ఇంట్లో దొంగతనానికి సాహసించాను. నేను దుష్టుణ్ణి-నా కిక నిష్కృతి లేదు బసవన్నా!

"ఈ నగరంలో ఒక ముసుగు మనిషి ఉన్నాడు. అతనికి కొందరు ఆంతరంగికులు వున్నారు. వారు కల్యాణ నగరంలో కల్లోలాలు రేకెత్తించాలని ప్రయత్నిస్తున్నారు. వారిని గూర్చి ఇంతవరకు మాత్రమే నాకు తెలుసు. అలాంటి వ్యక్తులలో ఒకడు నాకు వెయ్యి బంగారు నాణాలు కానుకగా ఇచ్చి- 'బసవని ఇంట్లో విజయవంతంగా దొంగతనం చేసుకురావా'లని ప్రోత్సహించాడు. ఆ ప్రోత్సాహ ఫలితంగానే నేనీ చేయరాని పాపానికి ఒడికట్టాను.

"రక్షక భటులారా! నన్ను బంధించండి. రేపు మీకు ఆ వెయ్యి సువర్ణ నిష్కాలు ఇచ్చిన వ్యక్తిని పట్టి ఇస్తాను" అన్నాడు కెంపరాయడు కన్నీళ్ళతో.

రక్షకభటులు కెంపరాయణ్ణి బంధించడానికి సిద్ధమైనారు.

"వద్దు. అతణ్ణి బంధించకండి. కెంపరాయణ్ణి స్వేచ్ఛగా వదలడమే అతనిలో సత్ప్రవర్తన పుష్పించి వికసించి ఫలించడానికి దోహదం చేస్తుంది. కెంపరాయా! రేపు కనబడతావు కదా?" అన్నాడు బసవన్న.

"కన్పడతాను తండ్రీ!" అని వెండిపాత్రను కింద పెట్టి బసవని పాదాలు స్పృశించి వెళ్ళబోయాడు.

"కెంపరాయా! నీవు మక్కువ పడ్డ వెండి పళ్ళెం నీవే తీసుకుపో నాయనా! శివుడు తనను మట్టితోనే అర్చించమని కోరుకుంటున్నాడనేందుకు ఇది నాకు సంకేతం" అన్నాడు బసవన్న.

కెంపరాయడు స్థాణువై నిలబడ్డాడు.

బసవన్న కెంపరాయని భుజం తట్టి కౌగిలించుకొని, వెండి పళ్ళెం అతడి చేతికిచ్చి బుజ్జగించి పంపాడు.

మొగసాల మీది గడియారం మోగింది. తొలి కోడి కూసింది. ఆకాశంలో ఉషస్తార మెరిసింది మరో ఉదయాన్ని సూచిస్తూ.

# 13

విజయ దశమి!

కల్యాణ నగరానికి వెలుపల వున్న పెద్ద మైదానంలో బిజ్జలుడు ఉత్సవాలూ, సైనిక ప్రదర్శనలూ ఏర్పాటు చేశాడు. దుర్గను పూజించారు ముందుగా.

లక్షలాది ప్రజలు ప్రదర్శనలు చూడడానికి వచ్చారు.

'ఇవి కేవలం సైనిక ప్రదర్శనలు కావు- యుద్ధ సన్నాహాలు' అనుకున్నారు ప్రజలు.

అయితే యుద్ధం ఎందుకు చేయవలసి వచ్చిందో మాత్రం అక్కడ కూర్చున్న అన్ని లక్షల మందిలోనూ ఎవరికీ అంతు చిక్కడం లేదు.

ఉన్నతాసనంపై బిజ్జలుడు కూర్చున్నాడు.

ఆయన పక్కనే ప్రధానమంత్రి బసవేశ్వరుడూ, ఆ పక్కనే రాజ గురువు నారాయణయ్య కూర్చున్నారు.

ఉన్నతాసనానికి రెండవ వైపున బిజ్జలుని కొడుకు- యువ రాజు- రాయమురారి కూర్చున్నాడు. అవతల సేనాధిపతులూ, ఇతర రాజోద్యోగులూ ఉన్నారు.

ఎదురుగా సైనికులు రకరకాల వ్యూహాలలో మోహరించి నిలబడ్డారు.

కొందరు క్రౌంచవ్యూహం పన్నారు. కొందరు గరుడ వ్యూహమూ, మరికొందరు సైనికులు అర్ధ చంద్ర వ్యూహమూ పన్నారు.

మకర వ్యూహమూ, శ్యేన వ్యూహమూ, పద్మ వ్యూహమూ, వజ్ర వ్యూహమూ, మండల వ్యూహమూ, కూర్మ వ్యూహమూ, శృంగాటక వ్యూహమూ వరుసగా ప్రదర్శించారు.

తర్వాత సైనికులు తమ తమ అస్త్ర శస్త్ర నైపుణ్యాలు చూపారు.

కొందరు తోమరములు తిప్పారు. మరి కొందరు కౌక్షేయ ములు ప్రదర్శించారు. కార్ముకము, గద, కుంతములు ద్వంద్వ యుద్ధంగానూ, సామూహిక యుద్ధంగానూ కూడా ప్రదర్శించి చూపారు.

యుద్ధ ప్రదర్శనకు నేపథ్యంలో తప్పెట్లు, కాహళలు, కాలి కొమ్ములు, డుమాయీలు, శంఖములు, డోళ్ళు, సన్నాయీలు, చేగంటలు- ఆయా ప్రదర్శన ననుసరించి మోగించారు.

ప్రదర్శనలను చూచేసరికి యువరాజు రాయమురారికి వీరావేశం వచ్చింది.

పొడవైన తన పట్టు పరివేషలాంఛనా వస్త్రాన్ని వదిలి రంగ స్థలంలోకి నడిచి గదా యుద్ధానికి ఎవరినైనా రమ్మన్నాడు.

ఎవరూ యువరాజుతో ఢీ కొనేందుకు సిద్ధ పడలేదు.

బిజ్జలుడు ఉత్సాహంగా చూస్తున్నాడు ఏమి జరుగుతుందా- అని.

తనను ఎదిరించడానికి ఎవరూ రాకపోవడంతో రాయమురారి నిరుత్సాహ పడ్డాడు.

సేనాధిపతులను ఎవరినైనా గదా యుద్ధానికి రమ్మని పిలిచాడు రాయమురారి.

సేనాధిపతులు సాహసించ లేదు- తాము ఓడిపోతే తమకు అవమానం- తాము గెలిస్తే యువరాజు మనసులో ఆగ్రహించ వచ్చు!
ఎందుకొచ్చిన ప్రమాదమిది?

"ఇంత సువిశాల పశ్చిమ చాళుక్య సామ్రాజ్యంలో యువ రాజుతో పోరాడ గల ధీరుడే లేడా?" అన్నాడు బిజ్జలుడు పెద్దగా.

అంత కరతాళ ధ్వనులు చేశారు.

"లేకేం ప్రభూ! యువరాజుగారిని ఎదిరించాలంటే భయం- అంతే!" అన్నాడు బసవేశ్వరుడు.

"ఎవరు? ఒకరిని ఎవరినైనా పిలువు బసవన్నా! ఇది క్రీడా యుద్ధమే కదా?" అన్నాడు బిజ్జలుడు.

"అలాగే ప్రభూ!" అని బసవేశ్వరుడు చిరునవ్వు నవ్వి శర ణుల వైపు చూశాడు.

భక్తులైన శివ శరణులూ, శరణురాండ్రూ, అనుభవ మంటప సభ్యులూ- అంతా ప్రత్యేకంగా ఒక వైపు కూర్చొని వున్నారు.

అనుభవ మంటపానికి అధ్యక్షుడైన అల్లమ ప్రభువూ, ఆయన ప్రక్కనే బసవేశ్వరుని అక్కగారైన నాగాంబిక కొడుకు చెన్న బసవుడూ కూర్చొని వున్నారు.

"చెన్న బసవా!" బసవన్న ప్రేమతో మేనల్లుణ్ణి పిలిచాడు.

మేనమామ పిలుపులో ఆంతర్యం గ్రహించి చెన్నబసవడు శరణుల మధ్యలోనుండి లేచి రంగ స్థలం మీదికి వచ్చాడు.

రాయమురారీ- చెన్నబసవన్నా ఇరువురూ సమవయస్కులే!

ఇరువురూ పదహారు- ఇరవై సంవత్సరాల లోపువారే!

ఒకరు మహారాజ పుత్రుడు- యువరాజు, మరొకరు ప్రధాన మంత్రి మేనల్లుడు- అనుభవ మంటప కార్యదర్శి.

చెన్నబసవన్న రంగం మీదికి రాగానే లక్షలాది ప్రజలు కర తాళ ధ్వనులు చేశారు.

శివ శరణులంతా తమ తమ స్థానాలలోనుండి లేచి ముని కాళ్ళ మీద కూర్చొని ఉత్కంఠతో చూస్తున్నారు.

చెన్నబసవన్న తల్లి నాగాంబిక, అనుభవ మంటప మహిళా విభాగ అధ్యక్షురాలు అక్కమహాదేవి- పక్క పక్కన కూర్చొని ఈ విచిత్ర యుద్ధాన్ని ఆసక్తిగా చూస్తున్నారు.

రాయమురారికి ఉత్సాహం వచ్చింది.

చెన్నబసవన్నను యుద్ధానికి ఆహ్వానించాడు.

ఒక గద తాను పట్టుకొని రెండవది చెన్నబసవనికి అందించాడు రాయమురారి.

ఇరువురూ శాస్త్ర సమ్మతమైన గదా యుద్ధం చేశారు.

భీమునితో భీముడు యుద్ధం చేసినట్టూ, రామునితో రాముడే పోరాడినట్టూ వున్నదా ప్రదర్శన.

ప్రేక్షకులంతా గగుర్పొడిచిన శరీరాలతో చూస్తున్నారీ విచిత్ర యుద్ధాన్ని.

ఎంతకూ గెలుపు ఓటములు తేలలేదు.

ఇరువురి యుద్ధాన్ని పర్యవేక్షిస్తున్న క్రీడాధికారి ప్రధాన సైన్యాధిపతి- "గదా యుద్ధాన్ని ఇక ఆపితే బాగుంటుంది" అని వినయంగా యువరాజుకు సలహా ఇచ్చాడు.

యువరాజు గదను వదిలాడు కాని, ఆయనలో కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్న రణావేశం చల్లారలేదు.

అందుకని వెంటనే ఖడ్గాన్ని చేతబట్టుకోని మరొకటి చెన్నబసవన్నకు అందించాడు.

యుద్ధోత్సాహంతో విజృంభించి వున్న చెన్న బసవన్న తక్ష ణమే ఖడ్గాన్ని పట్టుకొని రాయమురారిపై దూకాడు.

"దక్షాధ్వర సమయంలోని వీరభద్రునివలె ఉన్నాడు నీ కొడుకు" అన్నది అక్కమహాదేవి నాగాంబికతో. నాగాంబిక ఈ ప్రశంసకు పొంగిపోయింది.

చిత్ర విచిత్ర గతులలో ఖడ్గయుద్ధ ప్రదర్శన సాగుతున్నది.

తన తర్వాత సామ్రాజ్యాన్ని సమర్థవంతంగా రాయమురారి పరిపాలింపగలడని బిజ్జలునికి తొలిసారిగా ఆత్మ విశ్వాసం కలిగింది- ఈ ద్వంద్వ యుద్ధాన్ని చూచిన తరువాత.

ఇంతలో రాయమురారి ఖడ్గం తగిలి చెన్నబసవని కుడి భుజంపై రక్తం చిమ్మింది.

చెన్నబసవని శరీరం రక్తంతో తడిసి విరబూసిని మందార వృక్షం వలె శోభించింది.

శోణితాన్ని చూచేసరికి చెన్నబసవడు ద్విగుణీకృతోత్సాహంతో పెద్దగా సింహనాదం చేశాడు.

ఆ ధ్వని ఆకాశంలో ప్రతిధ్వనించింది- గౌరీదేవి కూర్చునే సింహ వాహనం కైలాసంనుండి బదులు పలికిందా అన్నట్లు.

ఇది క్రీడా యుద్ధమనే నమ్మకం సైన్యాధ్యక్షునికి పోయింది. ప్రేక్షకులంతా తాము విజయదశమి ఉత్సవాలు చూస్తున్నా మనే విషయం మరిచిపోయి, ఏ మహాభారత యుద్ధాన్నో, కురు క్షేత్రాన్నో దర్శిస్తున్నామన్న భ్రాంతిలో పడ్డారు.

రాయమురారి కాలుజారి కిందపడ్డాడు.

చెన్నబసవన్న హుంకారం చేసి కత్తితో మురారిపైకి విజృం భించాడు.

దుశ్శాసనుని రొమ్మును చీల్చి రక్తాన్ని తాగడానికై విజృం భించిన భీమసేనుడు స్ఫురించాడు ఒక్కక్షణం అందరికీ.

రణావేశంలో చెన్నబసవన్న తనను తాను మరచిపోయాడని బసవన్న గ్రహించాడు.

"ఓ షట్ స్థల చక్రవర్తీ!" అని పిలిచాడు బసవన్న తన మేనల్లుణ్ణి.

'షట్ స్థల చక్రవర్తి'-అనేది చెన్నబసవనికి అనుభవమంటపం ఇచ్చిన బిరుదు.

చెన్నబసవడు మేనమామ పిలుపుతో తల పైకెత్తాడు.

"ఇంక చాలు-క్రీడా యుద్ధాన్ని ఆపు" అన్నాడు బసవన్న.

యువకులిద్దరూ ఉత్సాహంతో ఇంకా ఉరకలు వేస్తూనే వున్నారు.

అయితే ప్రధాన సేనాధిపతి ఇంక ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా, రణోత్సాహం నుండి రాయమురారినీ చెన్న బసవన్నను వేరు చేశాడు. ప్రేక్షకులంతా జయ జయ ధ్వానాలు చేశారు.

"ప్రభూ! రక్త సిక్తమైన ఈ క్రీడలిక చాలు- ఏవైనా వినోద ప్రదర్శనలను తిలకిద్దాము" అన్నాడు ప్రధానమంత్రి బసవేశ్వరుడు.

"అలాగే-అలాగే" అన్నాడు తత్తర పాటుతో బిజ్జలుడు.

రాయమురారీ, చెన్న బసవన్నల యుద్ధ దృశ్యాల నుండి బిజ్జలుడింకా లౌకిక వాతావరణంలోకి రాలేదు పూర్తిగా.

"నృత్యాలూ, వినోదాలు ప్రదర్శించండి ఇంక" అని ఆజ్ఞా పించాడు ప్రధాన మంత్రి బసవేశ్వరుడు.

దెబ్బలు తగిలిన చోట్ల రాయమురారీకీ, చెన్న బసవనికీ తక్షణమే తైలాలు పూశారు.

వారి యుద్ధావేశం చల్లబడ్డది. మళ్ళీ వచ్చి నవ్వుతూ ఎవరి స్థానాలలో వారు కూర్చున్నారు.

బిజ్జలుని అస్థాన నర్తకీ మణులు ముందుగా హల్లీసక నృత్యం ప్రదర్శించారు.

తర్వాత గోండ్లి, పాత్ర గోండ్లి, ప్రేరణ శివ తాండవం ప్రదర్శించారు.

ప్రేరణ శివతాండవాన్ని అరవై నలుగురు కళాకారులు ఒకే సారి ప్రదర్శించారు.

ఈ నృత్యం చూచి లక్షలాది ప్రజలూ దిగ్భ్రాంతులై పోయారు.

భరతుని నాట్యశాస్త్రమూ, నందికేశుని అభినయ శాస్త్రమూ- రెండూ ఈ నృత్యంలోని విన్యాసాల ఉద్వేగానికి ఆగడం లేదు.

"ఇదేమిటి? ఇంత అద్భుత భయంకరంగా వుందీ నృత్యం?" అన్నాడు బిజ్జలుడు.

"ఇది ఓరుగల్లులో కాకతీయులు సాధన చేసే ఒక నృత్యం ప్రభూ! దీనిని వారు తమ స్వయంభూదేవాలయంలో ప్రదర్శిస్తూ వుంటారు. మన కళాకారులకు ఈ శైవ నృత్యాన్ని నేర్పాము. దీనిని ప్రేరణ శివతాండవం అంటారు. నర్తిస్తున్న ప్రతి కళాకారుడూ తాండవ వుణ్ణి అవాహన చేసుకుంటాడు తన శరీరం మీదికి. అదే ప్రేరణ తాండవం. అంటే మనం ఒకేసారి అరవై నలుగురు శివ మూర్తులు తాండవం చేస్తున్న దృశ్యాన్ని చూస్తున్నామన్న మాట" అని వివరించాడు ప్రధానమంత్రి బసవన్న.

ప్రేరణ నృత్యం ముగిసే సమయానికి ప్రేక్షకులలో నుండి "తైలపుడు- తైలపుడు" అన్న కేకలు వినబడ్డాయి. జనంలో గందరగోళం వ్యాపించింది.

చాళుక్య రాజైన మూడవ తైలపుడు రంగస్థలం మధ్యకు వచ్చాడు.

లక్షలాది ప్రజలూ శిలా మూర్తులవలె చూస్తున్నారు.

బిజ్జలుడు, రాయమురారి దిగ్భ్రాంతులై పోయారు. వారిలో చల నమే లేదు.

"ఏమిటి నన్నలా వింతగా చూస్తున్నారు?" అన్నాడు తైల పుడు.

"నేనేనండీ మూడవ తైలప చక్రవర్తిని- చాళుక్య రాజైన ఆరవ విక్రమాదిత్యుని వంశస్థుణ్ణి- జగదేకమల్లుని కుమారుణ్ణి. కాల చూరి వంశస్థుడైన ఈ బిజ్జలుడూ, కాకతీయ వంశస్థుడైన ఓరుగల్లు ప్రోలరాజూ నాకు సామంత రాజులే.

"కాని కాకతి ప్రోలుడు నేడు తనకు తానొక స్వతంత్ర రాజుగా ప్రకటించు కున్నాడు ఓరుగల్లు రాజధానిగా.

"ఆయనను జయించి తిరిగి కాకతీయ సామ్రాజ్యాన్నంతా మన పశ్చిమ చాళుక్య రాజ్యంలో కలుపుదామని యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నాడు మహా బిజ్జలుడు. అంతే కదూ?" అంటూ తైలపుడు అందరివంకా చూశాడు.

'ఇది నిజమా? ఓరుగల్లు ప్రోలరాజు చేతిలో బంధింపబడ్డ మూడవ తైలపుడు కల్యాణ నగరానికి ఎలా రాగలిగాడు?'

ఎవరూ తమ కన్నులను తామే నమ్మలేక పోతున్నారు.

తైలపుడు రంగస్థలం మధ్య నుండి నడుచుకుంటూ సరాసరి బిజ్జలుడు కూర్చున్న ఆసనం వైపుకు వచ్చాడు.

బిజ్జలుడు తొట్రుపాటుతో తన స్థానంనుండి లేచి నిలబడ్డాడు.
మూడవ తైలపుడు వచ్చి బిజ్జలునికి పాదాభివందనం చేశాడు.
మూడవ తైలపుడు తల పైకెత్తి నిలబడ్డాడు.

అక్కడ మూడవ తైలపుడు లేడు- కలకేత బ్రహ్మయ్య నిల బడి వున్నాడు.

"చాళుక్య ప్రజలకూ అధికారులకూ నా శరణాలు. నా ఇంద్రజాల విద్యలో ఇదొక చిన్న ప్రదర్శనాంశం- అంతే!" అని

బిజ్జలునికీ, రాయమురారికీ, బసవేశ్వరునికీ నమస్కరించి కలకె బ్రహ్మయ్య ప్రేక్షకులలోకి పరుగెత్తి పోయాడు.

హర్షధ్వానాలతో, నవ్వులతో, కేరింతలలో భూమ్యాకాశాలు ప్రతి ధ్వనించాయి.

బిజ్జలునికి గుండె దడ తగ్గింది.

'హహ్హహ్హా' అని పెద్దగా నవ్వుతూ తన చేతితో బిజ్జలుడు, ప్రధానమంత్రి బసవేశ్వరుణ్ణి భుజం మీద ఆదర పూర్వకంగా తట్టి "మీ అనుభవ మంటప సభ్యులు ఎన్నెన్ని వింతలు నేర్చారయ్యా!" అన్నాడు.

బసవేశ్వరుడు దరహాసం చేశాడు సమాధానంగా.

తరువాత నృత్య ప్రదర్శనాలు మళ్ళీ జరుగుతున్నాయి.

ప్రదర్శనానంతరం బిజ్జలుడు తన ప్రసంగాన్ని చేయాలని అనుకున్నాడు.

నర్తకులు నర్తకీమణులూ బృందగానాలతో సామూహిక నృతాలు ప్రదర్శిస్తున్నారు.

ఇంతలో రివ్వున ఒక బాణం దూసుకొని వచ్చింది. సరిగ్గా అది బసవనికీ బిజ్జలునికి మధ్య ఆసనంలో గుచ్చుకొన్నది.

రక్షక భటులు తత్తరపడ్డారు. బిజ్జలుడు ఉలికిపాటుతో లేచాడు.

శరవేగంతో జరిగిన ఈ సంఘటన కళాకారులకు తెలియక వారింకా నర్తిస్తూనే వున్నారు.

రక్షక భటులూ, గూఢచారులూ బాణం వచ్చిన దిక్కును గమనించి పరుగెత్తుకొని వెళ్ళి ఆ ప్రాంతాన్ని మండల వ్యూహంతో ముట్టడించారు.

ఒక్కొక్కరినీ పట్టుకొని ధనువూ, అంబులూ- ఎవరి వద్ద వున్నాయో అని వెతకడం మొదలుపెట్టారు.

అలా వెతుకుతుండగా ధనువు ప్రజల మధ్యలో ఒకచోట నేలమీద కన్పడింది.

ఆ పక్కనే శీలవంతుడు నిలబడి వున్నాడు.

"పట్టుకోండి- బంధించండి ఇతణ్ణి." అధికారులకు ఆజ్ఞాపించారు.

"నన్నా? ఎందుకు?" అని ప్రశ్నించాడు శీలవంతుడు.

"ఎందుకో న్యాయస్థానంలో చెప్పుకుందువుగాని, పదండిరా- పదండి." శీలవంతునితో సైనికులు నిష్క్రమించారు. క్షణంలో ఇది చాలామందికి తెలిసింది. ప్రజలలో గగ్గోలు బయలుదేరింది.

బిజ్జలుడు లేచి నిలబడి "సభను ఇంతటితో చాలిస్తున్నాను" అని ప్రకటించాడు.

కొందరు రక్షక భటులు ఆ బాణాన్ని సున్నితంగా ఆసనం నుండి తీసి వెడల్పైన ఒక పళ్ళెంలో పెట్టి పరీక్షార్థం పంపారు.

ప్రభువుకు సమీపంలో కూర్చున్న ఉన్నతాధికారులకు మాత్రం తెలిసింది.

"బాణ ప్రయోగం బిజ్జలుని మీదే జరిగింది" అనుకున్నారు కొందరు.

"కాదు, బసవేశ్వరుని మీదనే జరిగి వుండవచ్చు" నన్నారు కొందరు.

ప్రభువు రథం ఎక్కాడు గంభీరముద్రతో. రాయమురారీ రథం ఎక్కాడు.

రాజగురువు నారాయణయ్య తన అశ్వశకటం అధిరోహించాడు.

బసవన్న తీవ్రంగా ఆలోచిస్తూ తెల్ల గుర్రాన్ని ఎక్కాడు.

ఇంతలో రహస్య దళ విభాగం నుండి మారువేషంలో వున్న ఒక సైనికుడు వచ్చి బసవేశ్వరునికి ఒక అత్యవసర సందేశం

అందించాడు. గుర్రం మీది నుండే బసవన్న ఆ సందేశాన్ని తీసుకొని చదివాడు.

"కెంపరాయడు హత్య చేయబడ్డాడు" అని అందులో వుంది. క్రింద రహస్య విభాగాధికారి సంతకమూ, ముద్రికా వున్నాయి.

# 14

రక్షక విభాగంలోని నిపుణులు ఆ బాణాన్ని పరిశీలించి అది విషలిప్తమైనదని నిర్ధారించారు.

ఆ బాణపు ములికి చర్మానికి తగిలితే చాలు మనిషి ప్రాణాలను కోల్పోయే గరళం ఇనుప మొనకు లేపనం చేయబడి వుంది.

బాణంపై చెక్కిన నగిషీ, బాణపు కొలత, శిలవంతుని వద్ద దొరికిన ధనుస్సు కొలత అన్నీ నిపుణులు శ్రద్ధగా పరిశీలించారు.

'ఈ ధనువుతోనే ఈ బాణం ప్రయోగింపబడింది" అని నిర్ధారించి తమ నివేదికను సమర్పించారు రహస్య విభాగంలోని నిపుణులు.

బిజ్జలుడు తన అంతఃపురంలో రహస్య సమావేశం ఏర్పాటు చేశాడు.

రాజు, ప్రధాన మంత్రి, ప్రధాన సైన్యాధ్యక్షుడు ముగ్గురు మాత్రమే పాల్గొన్నారు అందులో.

"ఇంతకూ ఈ హత్యా ప్రయత్నం నా మీద జరిగినట్లా? నీ మీద జరిగినట్లా?" అని ప్రశ్నించాడు బిజ్జలుడు బసవన్నను.

బసవన్న ఏమీ మాట్లాడలేదు.

సర్వ సైన్యాధ్యక్షుడు ఆహవమల్లుడు మాత్రం "ఈ బాణం శీలవంతుడే ప్రయోగించాడని మన రక్షక విభాగం వారు అనుమానిస్తున్నారు" అన్నాడు.

బిజ్జలుని కనుబొమ్మలు ముడిపడ్డాయి ప్రశ్నార్థకంగా.

"ఏమంటావు బసవన్నా?" అని ప్రశ్నించాడు బిజ్జలుడు.

"ఏమంటాను, తొందరపడవద్దంటాను. అంతే ప్రభూ!" అన్నాడు బసవన్న.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

మళ్ళీ బసవేశ్వరుడే అన్నాడు-

"ప్రభూ! శీలవంతుడు అనుభవ మంటపంలో సభ్యుడు. కులానికి తక్కువ వాడైనా గుణానికి పరమశివునితో సమానం. అనుభవ మంటపంలో సభ్యత్వం ఇవ్వడానికి ముందుగా 'మనసా వాచా కర్మేణా హింసను మేము నిషేధిస్తున్నాము' అని ప్రతిజ్ఞ చేయిస్తాము. అందరూ ఆ ప్రతిజ్ఞను నెరవేర్చేందుకు యథాశక్తి సాధన మొదలు పెడతారు ఆ నాటినుండి.

"అయితే శీలవంతుడు సాధనలో ఎప్పుడో పరిపక్వత నందాడు. అతడు నా పైన గాని, మీ పైన గాని విషలిప్తమైన బాణాన్ని ప్రయోగించాడంటే అది హాస్యాస్పదం.

"అందులోనూ లక్షలాది ప్రజలున్న నిండు సభలో అంత బహిరంగంగా మన మీద శీలవంతుడు బాణప్రయోగం చేశాడనడం హేతువాదానికి విరుద్ధం. ఏ అవివేకీ అలాంటి పని చేయడు. బహిరంగంగా బాణప్రయోగం చేసి అదే ధనుస్సును పక్కన పెట్టుకొని హంతకుడు ఎప్పుడూ కూర్చోడు.

"కాబట్టి సారాంశమేమంటే ఎవరో మీ రంటేనో నేనంటేనో గిట్టనివాళ్ళు బాణాన్ని ప్రయోగించి ఆ నేరాన్ని శీలవంతుని మీదికి వచ్చేటట్లు చేయాలని ప్రయత్నించారు.

"నేరం శీలవంతుని మీదికి రావాలని వారు ప్రయత్నించడంలో ఆ హత్యా ప్రయత్నం స్పష్టంగా మీ మీదనే జరిగిందని నేను ఊహిస్తున్నాను" అన్నాడు బసవన్న.

"నా మీదనా?" బిజ్జలుడు కళ్ళు పెద్దవి చేసి ప్రశ్నించాడు.

"ఔను. ఎందుకంటే, శీలవంతుడు నన్ను చంపడానికి ఎన్నడూ ప్రయత్నించడు. కాకపోతే బాణం సరిగ్గా ఇరువురి మధ్యా పడింది కాబట్టి అనుమానాలకు ఆలోచనలకూ అవకాశం ఏర్పడింది. మీరు యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నారు. శీలవంతుడు హింసనూ, యుద్ధాన్ని నిషేధించాలని శాంతియుత పోరాటానికై దళాలను సిద్ధం చేస్తున్నాడు. కాబట్టి ఎవరైనా సరే, శీలవంతుడు బిజ్జలునిపై పగబట్టాడని తేలికగానే నమ్ముతారు. ఈ బాణప్రయోగంలోని రహస్యమదే!

"ఇటు మిమ్మల్ని హత్యచేసి-అమంగళం ప్రతిహతమగుగాక-ఇటు మీపై హత్యా ప్రయత్నం జరిపి, అటు దానిని అనుభవ మంటప సభ్యులపై తోస్తే ఒకే దెబ్బకు ఇటు బిజ్జలుణ్ణీ, అటు బసవన్ననూ నిర్మూలించవచ్చునని వారి పథకం" అని వివరించాడు బసవన్న.

ఆహవామల్లుడు ఈ విషయాలన్నీ శ్రద్ధగా విన్నాడు.

బిజ్జలుడు ఏమీ మాట్లాడలేకపోయాడు.

"మన ప్రధాన మంత్రిగారు- చెప్పిన దానిలో సత్యం ఉన్నట్లే నాకు అనిపిస్తున్నది" అన్నాడు ఆహవమల్లుడు.

"మరైతే ఈ ప్రయత్నాలు ఎవరు చేయించారంటావు?" అని ప్రశ్నించాడు బిజ్జలుడు.

బసవన్న అప్పుడు కెంపరాయని వృత్తాంతం చెప్పాడు.

"ప్రభూ! నిజానికి ఇలాంటి సంఘటనలకు ప్రచారం ఇచ్చు కోవడమూ, పైకి చెప్పుకోవడమూ నాకు అలవాటు లేదు. కాని

ఇప్పుడు రాజకీయ అవసరం వచ్చింది కాబట్టే కెంపరాయని సంఘటన మీకు చెప్పాను.

"రక్షక భటులు కెంపరాయణ్ణి బంధిస్తామన్నారు. కాని అతణ్ణి స్వేచ్ఛగా వదలడమే మానసిక పరివర్తనకు మంచిదని అలా చేశాను.

"'రేపు నాకు సువర్ణాలు ఇచ్చి మీ ఇంట్లో దొంగతనం చేయమన్న ముసుగు మనిషి ముఠా వారిని చూపిస్తాను' అన్నాడు కెంపరాయడు. ఆ అవకాశం కెంపరాయనికి లేకుండా చేయడం కోసం కెంపరాయణ్ణి హత్య చేశారు ఆ ముఠావారు. దానివల్ల తమ రహస్యం వారు కాపాడుకో గలిగారు. నిష్కారణంగా కెంపరాయడు నా వల్ల బలి ఐపోయాడు" అని చింతించాడు బసవన్న.

"ఇందులో నీ తప్పు ఏముంది బసవన్నా?" అన్నాడు బిజ్జలుడు.

"ఒకవేళ కారాగృహంలో వున్నా రక్షింపబడి వుండేవాడేమో! నేనలా అతణ్ణి స్వేచ్ఛగా వదలడమే అతడి మృత్యువుకు కారణమైంది" అన్నాడు బసవేశ్వరుడు విచారిస్తూ.

ఆహవమల్లుడు బసవేశ్వరుని ఉన్నత గుణాలకు మనసులోనే జోహార్లు అర్పించాడు.

'ఏమి మానవుడీయన! ఈ పృథ్వి మీదనే అపురూపమైన మానవుడు! దొంగను పరివర్తన చేసి తనకు తానే దొంగనని చెప్పుకుంటున్న వ్యక్తి. ఎవరో కెంపరాయణ్ణి చంపితే అందుకు తాను బాధ్యుడినని దుఃఖిస్తున్న వ్యక్తి- ఏమి అపూర్వ వ్యక్తిత్వమిది!' అని అనుకున్నాడు ఆహవమల్లుడు.

"ఏమైనప్పటికీ మహారాజుపై హత్యా ప్రయత్నం, ప్రధాన మంత్రి ఇంట్లో దొంగతనం- ఇవేవీ సామాన్యమైన సంఘటనలు కావు" అన్నాడు బిజ్జలుడు.

"ఔను. కాని వీటికి పరిష్కారం మాత్రం హింస కాదు" అన్నాడు బసవేశ్వరుడు.

"అంటే నీ ఉద్దేశం హంతకులను పట్టి శిక్షించ వద్దనా?"

"ఔను" అన్నాడు బసవన్న.

"అదేమిటి" అన్నాడు బిజ్జలుడు ఆశ్చర్యంగా.

"అంతే ప్రభూ! హింస అనే దొక భావం. బహిరంగంగా కొట్టడం- చంపడం అనేవి ఆ భావానికి బాహిరమైన ఆవిష్కరణాలు మాత్రమే.

"హింస చేసినవాణ్ణి హింసిస్తే హింసా భావం సమాజంలో నశించదు. కారణాలు ఏవైనా హంతకుడూ, అధికారీ ఇరువురు చేసినవీ క్రియాత్మకంగా హింసా కార్యాలే!

"మనం నిషేధించవలసింది నిర్మూలించ వలసింది హింసా త్మకులైన మానవులను కాదు ప్రభూ! కేవలం హింసా భావాన్ని మాత్రమే."

"అయితే రాముడు రావణుణ్ణి చంపడం తప్పంటావా?" అని ప్రశ్నించాడు బిజ్జలుడు.

"తప్పొప్పులు శ్రీరామచంద్రుణ్ణి గూర్చి చెప్పగలిగే అర్హత లేని సామాన్యుణ్ణి నేను ప్రభూ! కాని రాముడు రావణుణ్ణి చంపడం కన్నా, ప్రతి రావణుణ్ణీ ఒక రామునిగా మార్చాలనేదే నా మతం. అదే అనుభవ మంటప ఆదర్శం" అన్నాడు బసవేశ్వరుడు.

"ఇది జరిగే పనేనా?"

"తప్పక జరుగుతుంది ప్రభూ! మానవుడి మీద నాకా విశ్వాసం వుంది. మనిషిని కాక మనం ఇంక ఎవరిని నమ్మగలం? మానవుడు చిరంతన నిరంతర సనాతన ఈశ్వర చైతన్యానికి ఒక సాకార ఆవిష్కరణ.

"మానవునిలోని హింసా, ద్వేషమూ, ప్రలోభమూ, అవినీతి నశిస్తుంది. భూ కైలాసం అవతరిస్తుంది. శుద్ధ సర్వమయుడైన తెల్లని పరమ శివుడు మానవ సమాజ రూపియై భూమి మీదనే శాశ్వతంగా నివసించే కాలం వస్తుంది.

"అది నేడు అనుభవ మంటపంలో మేము చేసే కృషివల్ల ఈ కాలంలోనే రావచ్చు- లేదా తరువాతి కాలంలో- ఇంకా అనంతర

కాలంలో ఎప్పుడో ఎన్నటికో రావచ్చు. బసవేశ్వరుడు ఒక మనిషి కాదు ప్రభూ!- ఒక భావం. ఈ భావానికి చావు పుట్టుకలు లేవు.

"అహింసా కర దీపం పట్టుకొని నేను మానవాళిలో ఎప్పుడూ జీవిస్తూనే వుంటాను ఈ పృథ్వి ఉన్నంత వరకూ" అన్నాడు బసవన్న.

బిజ్జలుడు నవ్వాడు.

"ఆహవమల్లా! ఈయన చేసిన ఉపన్యాసం నీ కేమైనా అర్థమైందా?" అన్నాడు బిజ్జలుడు.

"అర్థమైనట్లే ఉంది ప్రభూ!" అన్నాడు ఆహవమల్లుడు ఇంకే మనాలో తెలియక.

"ఎందుకు మొగమాట పడతావు ఆహవమల్లా! ఈయన చెప్పింది ఒక్క అక్షరమూ నాకు అర్థం కాలేదు. రావణుణ్ణి రాముడిగా మార్చాలిట - బసవన్న అంటే మనిషి కాదు ఒక భావమట- శివుడు సమాజ రూపంలో భూమి మీద నివసిస్తాడట- మానవుడు కామక్రోధాది గుణాలు లేకుండానే జీవించే యుగం వస్తుందిట!

"ఏమిటీ వెర్రి ఈయనకు? భక్తి ముదిరి పిచ్చిగా మారింది- తలకిక రోకలి చుట్టడమే తరువాయి" అన్నాడు బిజ్జలుడు.

బసవేశ్వరుడు దరహాసం చేసి ఊరుకున్నాడు.

"అటు భయంకర హత్యా ప్రయత్నాలు జరిగాయి. హంతకులు విషబాణాలతో ప్రయోగాలు చేస్తున్నారు. పడగలు విప్పిన పాములై స్వేచ్ఛగా రాజ్యంలో సంచరిస్తూ అరాజకం సృష్టిస్తున్నారు. ఈయ నేమో కామ క్రోధ లోభమోహాలు లేని సమ సమాజం నవసమాజం సృష్టిస్తాడట'"

"బాబూ, బసవన్నా! నాకా నవ సమాజం వద్దు. ఇలా కామ క్రోధాదులు గల మనుషులే కావాలి. వాళ్ళను మనం పట్టుకొని చంపుతూనే వుండాలి. అప్పుడే వుంటుంది జీవితంలోని సారమంతా. ఆహవమల్లా!

"ప్రభూ!"

"ఆ ముసుగు మనిషి మతా గూర్చి గూఢచారి దళాలను నియోగించి శత్రు వ్యూహాలను భేదించే బాధ్యత నీది" అన్నాడు బిజ్జలుడు.

"ప్రభూ! నా దొక చిన్న విజ్ఞప్తి" అన్నాడు బసవన్న.

"ఏమిటి?"

"శీలవంతుణ్ణి విడుదల చేయండి. అతడెక్కడికీ పారిపోడు. అతడికి నేను పూచీ కత్తు ఇస్తున్నాను" అన్నాడు బసవన్న.

బిజ్జలుడు ఒక్క క్షణం ఆలోచించాడు.

"ప్రధాన మంత్రి సలహా నే నెందుకు కాదనాలి? అలాగే శీల వంతుణ్ణి వదులుతాము, దానివల్ల చాలా ప్రయోజనాలు నెరవేరుతాయి. ఒకటి- నీ కోరికను మన్నించినట్టూ అవుతుంది. రెండు-రాజ్యంలోని వీర శైవులలో అసంతృప్తి రాకుండానూ వుంటుంది. మూడవది- శీలవంతుణ్ణి వదిలి అతడి చర్యలూ, ప్రవర్తనా శ్రద్ధగా పరిశీలిస్తూ వుంటే మనకేమైనా, బయటనే సమాచారాలు దొరకవచ్చు. ఒకవేళ అతడే నేరస్థుడైతే....శీలవంతుణ్ణి వదిలి అతనిపై ఒక కన్ను వేసి ఉంచు- ఆహవమల్లా!" అన్నాడు బిజ్జలుడు.

"నా మాటను గౌరవించి నందుకు కృతజ్ఞుణ్ణి" అని బసవే శ్వరుడు లేచాడు.

'మొత్తానికి బిజ్జలుడు అసాధ్యుడు' అని మనస్సులో అను కుంటూ లేచాడు ఆహవమల్లుడు.

# 15

గౌరీ దేవాలయం వద్ద లావణ్యవతీ శీలవంతులు కలిశారు.

ఎవరికి వారు విడివిడిగా పూజకోసం వచ్చారు. అనుకోకుండా కలుసుకున్నారు.

లావణ్యవతికి శీలవంతుణ్ణి చూడగానే సంగమేశ్వర నగరంలో

తన కాలులోని ముల్లు శీలవంతుడు తీసిన సంఘటన గుర్తుకు వచ్చింది.

లావణ్యవతిని చూడగానే తొలిసారి గౌరీ మందిరం వద్ద ఆమెను కలుసుకోవటమూ, కృష్ణపెద్ది సంఘటనా గుర్తుకు వచ్చాయి.

"నాయనగారి ఆరోగ్యం బాగున్నదా?" శీలవంతుడే ప్రశ్నించాడు.

"ఆ! ఇప్పుడాయన మామూలుగా కోలుకుంటున్నారు. ఇటీవల ఒకనాడు ఆయన మీ ఇంటికి వచ్చినట్లూ, లోపల ఎవరో ఏవో చర్చిస్తూ ఉండటం వల్ల వెనుదిరిగి వచ్చినట్లూ మా అశ్వపాలకుడు బాచరసు చెప్పాడు" అన్నది లావణ్యవతి.

"ఔను. నేనూ, మేదర చెన్నయ్యగారి ద్వారా ఈ వార్త విన్నాను. నిజమేనన్న మాట" అన్నాడు శీలవంతుడు.

"నిన్నీ మధ్య అధికారులు బంధించారట కదా?"

"ఔను అమ్మాయిగారూ! ప్రభువులపై విజయదశమినాడు జరిగిన హత్యా ప్రయత్నంలో నా దోషం వున్నదని అనుమానించి బంధించారు. కాని బసవన్నగారు చెప్పి నన్ను విడిపించారు."

"ఓహో! అయితే యింకా అనుమాన నివృత్తి కాలేదన్న మాట!"

"లేదు. నన్ను ఇప్పుడు రాజోద్యోగులు నిరంతరం వెంబడిస్తున్నారు. దానికి తోడు ఈ శాంతి దళాల ఉద్యమం ఒకటి."

లావణ్యవతి బిల్వవనంలోకి నడిచింది.

శీలవంతుడు వెంట నడిచాడు.

"ఈ శాంతిదళాల ఉద్యమమేమిటీ?" అని ప్రశ్నించింది లావణ్యవతి చిరునవ్వుతో.

ఆలయంలో నుండి లకుమాయి ప్రసాదాలతో ఇవతలికి వచ్చి బిల్వవనంలో దగ్గరగా కూర్చొని మాట్లాడుకుంటున్న లావణ్యవతీ శీలవంతులను చూచి ఇక ముందుకు పోకుండా ఆలయ మంటపంలోనే ఒక స్తంభానికి ఆనుకొని కూర్చున్నది.

"అదే అమ్మాయిగారూ! మన ప్రభువు యుద్ధసన్నాహాలు

చేస్తున్నారు కదా! వాటిని నిరోధించాలని మా ప్రయత్నం" అన్నాడు శీలవంతుడు.

"దానివల్ల ప్రభువులకు నీ మీద అనుమానం ఇంకా ఎక్కువవుతుంది. ఆయన యుద్ధం ఎందుకు చేస్తున్నాడో తెలుసా? బిజ్జలుడు కాలచూరిరాజు. పశ్చిమ చాళుక్యులకు- కాలచూరి వంశస్థులు సామంతులు. పశ్చిమ చాళుక్యులకు ఓరుగల్లు కాకతీయులూ సామంతులే. అయితే ఓరుగల్లు ప్రోలరాజు తాను స్వతంత్ర కాకతీయ రాజ్యాన్ని ప్రకటించుకున్నాడు. దానిని అణచడం కోసం వెళ్ళిన మూడవ తైలపుణ్ణి, యువరాజు సోమేశ్వరుణ్ణీ బంధించి అనమకొండలో ఉంచాడు.

"స్వామి భక్తిగల బిజ్జలుడు కాకతీయుల పై దండెత్తి తన స్వామిని విడిపించి తెచ్చి తిరిగి మూడవ తైలపునికి కల్యాణ నగరం కట్టబెట్టి తాను రాజుగా తప్పుకోవాలని అనుకుంటున్నాడు. తాను, రాజుగా వుండటం కేవలం భరతుని పాదుకలు మోయడమేననీ తైలపుని రాకకోసం తాను ప్రతినిధిగా మాత్రమే చాళుక్య సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాననీ బిజ్జలుడు ఇటీవల ప్రకటించాడు కూడా సభాముఖంగా" అన్నది లావణ్యవతి.

శీలవంతుడు నవ్వాడు.

"అమ్మాయిగారూ! తమరు మధువరసుగారి కుమార్తెలు. అందువల్ల అలా అనుకోవడంలో ఆశ్చర్యం లేదు. కాని ప్రజలలో అలాంటి భావం లేదు. బిజ్జలుడు చాళుక్య సామ్రాజ్యాన్ని శాశ్వతంగా తానే కబళించాలనీ, తన తర్వాత రాయమురారిని రాజుగా చేయాలనీ అనుకుంటున్నట్లు ప్రజలు ఊహిస్తున్నారు."

లావణ్యవతి నిజంగానే ఆశ్చర్యపోయింది.

"అలా అనుకుంటున్నారా మీరు? నాకు తెలియదే! అయితే కాకతీయులపై బిజ్జలుడు ఎందుకు యుద్ధ సన్నాహాలు చేస్తున్నట్లు?" అని ప్రశ్నించింది లావణ.

"కాకతీయులపై బిజ్జలుడు ఎంతవరకు యుద్ధం చేస్తాడనేది కూడా అనుమానమే! కాకతీయులూ వీరశైవులే. రెండు శైవ రాజ్యాలు పరస్పరం యుద్ధం చేసుకోవు. అయితే బిజ్జలుడు కాక

తీయులని 'మూడవ తైలపుణ్ణి అప్పగించమని' అడిగాడట."

"'తైలపుడూ సోమేశ్వరుడూ పారిపోయారు. అనుమకొండలో లేరు' అని కాకతీయులు సమాధానం చెప్పారట. ఇప్పుడు బిజ్జలునికి పట్టిన మనోవ్యాధి ఒకటే! - ఎలాగైనా శత్రుశేషం అగ్ని శేషం లేకుండా చేసుకోవాలనే.

"అందుకే సైన్యంతో ఒరుగల్లు పోయి తైలపుడు ఒకవేళ అక్కడ వుంటే స్వాధీనం చేసుకొని మార్గమధ్యంలో చంపి శాశ్వతంగా తన దారి నిష్కళంకం చేసుకోవాలని చూస్తున్నాడు."

ఈ మాటలు విని లావణ్యవతి భయపడిపోయింది- నివ్వెరపోయింది- ఆశ్చర్యపడింది.

"శీలవంతా! ఇదంతా నిజమే నంటావా?"

"అలాగే ప్రజలు అనుకుంటున్నారు అమ్మాయిగారూ!"

"నాకిది తెలియదే!"

"తమరు అంతఃపురంలో వుంటారు- ఎలా తెలుస్తుంది? మేమంటే ప్రజల మధ్య ఉంటాము కాబట్టి నిత్యం ప్రజా జీవనాన్ని వ్యవహారాన్ని గ్రహిస్తూ వుంటాము."

"నీ కిన్ని రాజకీయ విషయాలు తెలుసునా?" అని అడిగింది లావణ్యవతి.

"నాకు రాజకీయాలు తెలియవు అమ్మాయిగారూ! శివానుభవమే నాకు తెలిసిన ఒకే ఒక రాజకీయం. అదే మా తల్లీ, తండ్రీ, గురువూ. దైవమూ. అన్నీ తానే అయి బసవేశ్వరుడు నాకు నేర్పిన విద్య కూడా అదే!

"ఇప్పుడు నేను చెప్పినవి జటిలమైన రాజకీయాలు కావు- కల్యాణ నగర వీధులలో ప్రజలు గుసగుసలుగా అనుకునే మాటలు. కాని ఇక రాజకీయాలు నేర్చుకోక తప్పేటట్లు లేదు."

"ఎందువల్ల?"

"నాపై రాజద్రోహ నేరం వచ్చింది. హింస కలలో ఇలలో కూడా అనుభవ మంటప సభ్యులు స్మరించరు. బసవన్న ఇలా ఒక వచనంలో చెప్పారు___

'ఉత్తమ కులమన కథమ కులమన

కు త్తి జన్మమే కారణ మెట్లగు?
హింసాత్ముండగు వాడే మాదిగ
నీచు భుజించెడి వాడే మాలడు
సర్వ భూతహిత మెవరు కోరునో
సంగమ దేవ కులస్థుండాతడు' అని.

"మేము జన్మ సిద్ధంగా నీచ కులంలో పుట్టినా కర్మ సిద్ధంగా ఇప్పుడు హింసనూ, ద్వేషాన్ని వర్జించి సాత్విక జీవితం గడుపు తున్నాము. అలాంటిది నాపై హింసకు సిద్ధమైనాన్న ఆరోపణ-అందు లోనూ రాజ ద్రోహం వచ్చినది. ఇది సామాన్య విషయం కాదు.

"దీనిని నేను తొలగించుకోవాలంటే నిజంగా విష లిప్తమైన బాణ ప్రయోగం చేసిన దోషులెవరో బయట పెట్టాలి. బసవన్న ఇంట్లో దొంగ తనానికి కెంపరాయణ్ణి ప్రోత్సహించిన దెవరో, కెంప రాయణ్ణి హత్య చేసిన దెవరో కూడా బయట పెట్టాలి. అప్పుడే సమా జం నిజానిజాలు గ్రహించ గలుగుతుంది.

"అమ్మాయిగారూ! ఈ విషయంలో కలకేత బ్రహ్మయ్య నాకు సహాయం చేస్తానన్నాడు. ఎలాగైనా సరే- ఆ ముసుగు మనిషి రహస్య ఛేదనం మేమిద్దరమూ చేయాలని అనుకుంటున్నాము" అన్నాడు శీలవంతుడు.

లావణ్యవతి తన వాయు మేఘపు చీరె చెంగుతో శరీరాన్ని నిండా కప్పుకోని త్రిసరములు ఊగుతుండగా ముందుకు తలవంచి అన్నది—

"అందుకు ప్రభుత్వ రహస్య విభాగంవారు ఉన్నారు. నీ వీ చిక్కులలో ఇరుక్కోవడ మెందుకు?"

శీలవంతుడు ఒక్క క్షణం ఆగి—

"నాపై మీకు గల ఆదరానికి ధన్యవాదాలు. అయితే ఇప్పుడు నేరస్థుణ్ణి నేనె కనుక, నేరం చేయలేదని నిరూపించుకో వలసిన బాధ్యత కూడా నా మీదనే ఎక్కువగా వుంది. నిజమైన నేరస్థులు దొరికితే తప్ప ఇది సాధ్యం కాదు" అన్నాడు.

లావణ్యవతి తెల్లగా నవ్వింది.

"శీలవంతుడు నేరాలు చేసే దశలోకి వచ్చాడన్న మాట!" అన్నది చమత్కారంగా.

"అయితే నాతో ఇలా ఏకాంతంగా బిల్వవనంలో మాట్లాడటమూ నేరమే!" అన్నది లావణ్యవతి.

"నిజమే అమ్మాయిగారూ! క్షమించండి. ఎవరైనా చూస్తే అపార్థం చేసుకుంటారు" అని శీలవంతుడు వినయంగా లేచి నిలబడ్డాడు.

"నేను హస్యాన్ని కన్నాను శీలవంతా!" అన్నది లావణ్యవతి.

"మీరు హస్యాని కన్నా ఎవరైనా ఏమైనా అంటే అప్పుడు మన బతుకులు అపహాస్యంపాలు కావలసి వస్తుంది. పైగా నీడలా నన్నిప్పుడు రహస్య విభాగం వారు వెంబడిస్తున్నారు కూడా" అన్నాడు శీలవంతుడు.

లావణ్యవతి కూడా వాయుమేషపు చీరె కుచ్చెళ్ళకు అంటిన పచ్చిగడ్డిని దులుపుకొని లేచి నిలబడింది.

'అమ్మయ్య!' అనుకొని లకుమాయి ఆలయ మంటపంలో నుండి లేచి వచ్చింది.

"అమ్మాయిగారేదో శీలవంతునితో రహస్యంగా మాట్లాడుతున్నారే!" అన్నది లకుమాయి వ్యంగ్యంగా.

"అవును-రహస్యమే అమ్మాయిగారూ! మన సంభాషణ ఎవ్వరికీ లకుమాయికికూడా చెప్పనని మీరు మాట యివ్వాలి" అన్నాడు శీలవంతుడు.

"అలాగే" అన్నది లావణ్యవతి.

"ఓహో! అంత ఎవరికీ చెప్పకూడని రహస్యాలు మాట్లాడుకునేవరకూ వచ్చిందన్నమాట వ్యవహారం" అన్నది లకుమాయి.

"ఛీ! పోవే" అన్నది లావణ్యవతి.

"అపార్థం చేసుకోకండి లకుమాయిగారూ! మేము వేరే విషయాలు మాట్లాడుకున్నాము-అవి ఎవరికీ చెప్పకూడనివి" అన్నాడు శీలవంతుడు.

"అన్నీ మాకు తెలుసులేవయ్యా!" అంటూ లకుమాయి నవ్వి "అమ్మాయిగారూ! పదండి-ఇప్పటికే ఆలస్యమైంది" అన్నది.

లకుమాయీ, లావణ్యవతీ గుర్రపుబండి ఎక్కారు. వెళ్తున్న బండిని చూస్తూ శీలవంతుడు ఒక్కక్షణం అలాగే నిలబడ్డాడు.

# 16

బిజ్జలుడు ఏదో రాజకీయ విషయం తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"ప్రభూ! రాజగురువు నారాయణాక్రామితులు వస్తున్నారు" అని ద్వారపాలకుడు వచ్చి చెప్పాడు.

"మంచిది. లోపల ప్రవేశపెట్టు" అని తన చేతిలోని పత్రాలను చుట్టి పక్కనే వున్న రత్నపేటికలో పెట్టి ద్వారంవైపు చూచాడు బిజ్జలుడు.

నారాయణయ్య చిరునవ్వుతో ప్రవేశించాడు. రాగానే బిజ్జలుణ్ణి ఆశీర్వదించాడు.

"నారాయణో రక్షతు! ధనకనక వస్తువాహన సమృద్ధి రస్తు! ఆచంద్రార్కం వంశాభివృద్ధి రస్తు! శీఘ్రమేవ కాకతీయ సామ్రాజ్య ప్రాప్తిరస్తు!" అని దీవించాడు నారాయణయ్య.

"అంతంత మాటలు అనకండి నారాయణులవారూ! కాకతీయ

సామ్రాజ్యం కాజేయాలని మాకు కలలోకూడా లేదు" అన్నాడు నవ్వుతూ బిజ్జలుడు.

"మీకు కాంక్ష లేకపోవచ్చు. కాని పరమేశ్వర నిర్ణయం ఎవరు కాదనగలరు? నిజానికి మీకు చాళుక్య సామ్రాజ్యంమీద కూడా కాంక్షలేదు. ఐనా మూడవ తైలపుడు ఓరుగల్లులో బందీ కావడమూ, గత్యంతరంలేక తైలపుని పక్షాన రాజప్రతినిధిగా మీరు చాళుక్య సామ్రాజ్యాన్ని పాలింపవలసి రావడం- పరమేశ్వర నిర్ణయమే కదా! ఏ నాటికి ఏది ఎలా కానున్నదో ఎవరు చెప్పగలరు? అంతా పరమేశ్వరాజ్ఞ" అన్నాడు నారాయణయ్య ఆసనం అలంకరిస్తూ.

"మాకు పరరాజ కాంక్షాలేదు- అన్యమత ద్వేషమూలేదు" అన్నాడు బిజ్జలుడు.

"మహా ప్రభువులు ఆ విషయం ఎక్కువగా వివరించనక్కర లేదు. వీర శైవుడైన బసవేశ్వరుడు మీకు ప్రధానమంత్రి. వీర వైష్ణవుడినైన నేను మీకు రాజగురువును. ఇంతకు మించి మీ మత సామరస్యానికి ఇంక ప్రత్యక్ష్యతార్కాణం ఏమి కావాలి?"

"నిజమే! కాని ఈ విషయం ఎందరు సరిగ్గా అర్థం చేసుకో గలిగారు? నాకు రాజ్యకాంక్ష అని ప్రజలు అనుకుంటున్నారుట! కాక తీయులపై దండెత్తి అక్కడ ఒకవేళ తైలపుడూ, సోమేశ్వరుడూ వుంటే వారిద్దనీ పట్టిచంపి శత్రుశేషం లేకుండా చేసుకోవాలని నేను ప్రయత్నిస్తున్నానట!"

"అమ్మమ్మా! ఎంత మాట?" రెండు చెవులూ మూసు కున్నాడు నారాయణయ్య- "ఎవరన్నదీ కారుకూతలు?"

"ఎవరో ప్రజలు గుసగుసలాడుకుంటున్నట్లు మా గూఢ చారులు వార్తలు తెచ్చారు."

"తమరు మాత్రం శ్రీరామచంద్రునిలా తొందరపడి ఎవడో ఏదో అన్నాడని ఈ చాళుక్య రాజ్యం వదిలివేయకండి. మీరు లేకుంటే సామ్రాజ్యమూ, ప్రజలూ దిక్కుమాలిన వారవుతారు."

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి."

"ఇది కేవలం అభిమానంతోనే అన్న మాటలు కాదు-రాజ్యంలో నూటికి తొంభై తొమ్మిది మంది అనుకుంటున్న మాటలు."

"కనీసం నూరో వాడు ఒకడు నాకు వ్యతిరేకంగా అనుకుంటున్నాడన్న మాట!"

"అది ఎప్పుడూ తప్పదు. అలాంటివాడే ఈ విషలిప్త బాణాలను ప్రయోగిస్తూ వుంటాడు."

బిజ్జలుడు ఒక్క క్షణం ఆగి "ఇంతకీ ఈ బాణ ప్రయోగం ఎవరు చేశారంటారు ఆచార్యుల వారూ?" అన్నాడు.

"ఏమో చెప్పలేము. కాని శీలవంతుడు మాత్రం కాదనే నా వుద్దేశం" అన్నాడు నారాయణయ్య.

"అంతేనంటారా?"

"అక్షరాలా! శీలవంతుడు పేరుకు దగ్గ సౌశీల్యవంతుడు. అందులోనూ అనుభవ మంటప సభ్యుడు. బసవన్నగారి శిష్యులంటే వారు భూలోక ప్రమథగణమే కదండీ! అలాంటి వాడు హింసాత్మక కార్యాలు కలలో కూడా చెయ్యడు. కాని నాకొక్క విషయమే నచ్చలేదు."

"ఏమిటి?"

"అతడలా శాంతి దళాలను పోగుచేసి ఉద్యమం నడపడమే నచ్చలేదు. శీలవంతుడు చేసినది మంచిపనే కావచ్చు. కాని అది తర్వాత విషపరిణామాలకు దారి తీస్తుంది. ఒకసారి ఉద్యమాలు

విజయ

నడిపామంటే ప్రజలలో క్రమశిక్షణ పోతుంది. రాజభక్తి తగ్గి అరాజకం ప్రబలే అవకాశం ఎక్కువవుతుంది. సరే, దానికేమిటి-శీలవంతుడు వయసులో చిన్నవాడు కాబట్టి, యుక్తాయుక్త విచక్షణ అంతగా తెలియకపోవచ్చు. ఎలాగైనా బసవన్న గారి ద్వారానే...."

"బసవన్నగారి ద్వారానే....?"

"శీలవంతునికి నచ్చజెప్పించి ఇలా ప్రభుత్వ వ్యతిరేకోద్యమాలు లేకుండా చేయించాలి."

"ఔను,నారాయణయ్యగారూ! నేనూ అదేఅనుకుంటున్నాను."

"అంతే—అంతే! అంతకు మించి నా మనస్సులో మరింకే భావమూ లేదు. అంతేకాక మరో చిన్న విషయం కూడా వున్నది...."

"ఏమిటి?"

"మొన్న చెన్న బసవన్న యుద్ధ నైపుణ్యం చూచాము. చూడ కన్నుల పండువులా వుంది. నిజంగా భారతంలోని కుమారాస్త్ర విద్యా ప్రదర్శనలాగా వుంది."

"అదేమిటి-అలా అంటున్నారు? కుమారాస్త్ర విద్యా ప్రదర్శనలతోనే కురు పాండవుల వైరానికి బీజాలు ఏర్పడ్డాయి."

"అమ్మమ్మ! అంత మాట అంటానా నేను? కేవలం సామాన్య ఉపమానం మాత్రమే ఇది. రాయిమురారీ, చెన్న బసవన్నల క్రీడా యుద్ధం యొక్క ఘనతను వర్ణించేందుకు మాత్రమే అలా అన్నాను కాని, అందులో మరే అంతరార్థమూ లేదు. కాని ఒక్క విషయం మాత్రం మనం గమనించాలి.

"ఏంతైనా చెన్న బసవన్న బ్రాహ్మణుడు. వేదా ధ్యయనం అతడి వృత్తి. హింసాత్మక పశు యజ్ఞాలను బసవన్న నిషేధించినా చెన్న బసవన్న జన్మ సిద్ధంగా బ్రాహ్మణుడేననీ, అటు పశ్చిమ చాళుక్య ప్రభువులూ-ఇటు మహా ఘనత వహించిన తమ పూర్వీకులైన కాల చూరి ప్రభువులూ-ఎవరూ వర్ణ వ్యవస్థను ధిక్కరించలేదనీ,

ధర్మ స్వరూపులైన తాము కూడా వర్ణ వ్యవస్థాపనకు బద్ధకంకణులై నారనీ అందరికీ తెలుసు.

"అలాంటప్పుడు బ్రాహ్మణుడైన చెన్న బసవన్న క్షత్రియ విద్యలు నేర్చుకోవడమూ-అందులోనూ యువరాజుకు సమ ఉజ్జీగా అన్ని లక్షల మంది సమక్షంలో యుద్ధం చేయడమూ...."

"అది క్రీడాయుద్ధమే. అందులోనూ చెన్న బసవన్న మహా బుద్ధిమంతుడు. షట్ స్థల చక్రవర్తి-కుండలినీ యోగ సాధకుడు-అనుభవమంటపానికి ప్రాణం-రాజభక్తిపరుడు. కలలో కూడా మనకు ద్రోహం మనసా వాచా కర్మేణా తలపెట్టలేని పుణ్య శ్లోకుడు."

"అవన్నీ నాకు తెలుసు. అయినా లోకులు పలుకాకులు. చూశారూ-ఎంతయినా ఒక బ్రాహ్మణుడు రాజపుత్రునితో సమానంగా సమరం చేయగలగడం...."

"ఔను."

"ఔనౌను, అంతే- అంతే! అంతకు మించి మరేమీ లేదు. ఇంకే అంతరార్థమూ లేదు నా మాటల్లో. ప్రజాభిప్రాయాన్ని కూడా కాస్త గమనించుకుంటూ పోవాలి మనం. శైవులు అధిక సంఖ్యా కులుగా వున్నా వైష్ణవులు కూడా ఉన్నారు.

"జైనులూ, బౌద్ధులూ, శాక్తేయులూ, అద్వైతులూ స్వల్ప సంఖ్యలో వున్నారు. మనం వారి మన్నన కూడా పొందవలసిందే! అప్పుడే సర్వజనాదరణకూ పాత్రులమై, ప్రభువు నిష్పాక్షిక పాలకుడనీ, జనరంజకుడనీ, సర్వ సమాన భావం కలవాడనీ పేరు తెచ్చుకో గలుగుతాడు."

"ఔను- మీరు చెప్పింది రాజనీతి దృష్ట్యా యథార్థమే."

"అంతే- అంతే! ఆ రాజ నీతినే నేను తమకు మరొకసారి గుర్తు చేశాను-అంతే! అంతకు మించి నా మాటల్లో మరే అంతర్యామూ లేదు."

"అయితే ఇప్పుడు మీరు నా కిచ్చే సూచన లేమిటి?"

నారాయణయ్య నవ్వి "ప్రభువులవారు ఏదో నా పై ఆదరంతో అలా అంటున్నారే కాని, నేను తమకు రాజకీయాలలో సూచన నివ్వ గల ప్రజ్ఞాశాలినా? రాజకీయ విషయాలలో సూచన లివ్వాలంటే దైవాంశసంభూతుడు బసవేశ్వరుడు ఇవ్వవలసిందే.

"అయినా తమరు అడిగారు కాబట్టి చెపుతున్నాను- యుద్ధ ప్రయత్నాలు విరమించండి. దీనివల్ల ఇటు ప్రజలమాటను మన్నించి నట్లూ అవుతుంది, అటు ప్రత్యక్షంగా కాకతీయులతో కయ్యానికి కాలు దువ్వకుండానూ తప్పిపోతుంది."

"నిజమే కాని...." అని సంశయించాడు బిజ్జలుడు.

"నాకు తెలుసు-నాకు తెలుసు మీ మనసులోని మాట. మనకు తైలపుడు కావాలి. ఆయన రహస్యాలు తెలుసుకోవాలి. దురుద్దేశంతో కాదు- మూడవ తైలపుడు మన చక్రవర్తి, ఆయన యోగ క్షేమాలు తెలుసుకోవడం మన కర్తవ్యం."

"అంతే-అంతే!"

"జానాను. నా కంతమాత్రం తెలియదా?" అని చిరునవ్వు నవ్వాడు నారాయణయ్య.

"అయితే ఇంత పెద్ద ఎత్తున యద్ధప్రయత్నాలు విరమించండి. మన సైనికులకూ, గూఢచారులకూ మారు వేషాలు వేసి కాకతీయ రాజ్యం పంపించి-చక్రవర్తి మూడవ తైలపుడూ, యువరాజు సోమే శ్వరుడూ ఎక్కడ వున్నారో తెలుసుకోని రమ్మనండి."

"అంతేనంటారా!"

"అంతే-అంతే! పైగా ఇంకోవార్త విన్నాను- ద్రాక్షారామంలో పరమేశ్వరుడు మల్లికార్జున పండితారాధ్యుడనే పేర అవతారంగా జన్మించాడట. ఆ మల్లికార్జున పండితారాధ్యులవారు ప్రస్తుతం కాక తీయ సామ్రాజ్యంలో ఉన్నారు. వారిని మనం దర్శించాలనుకుంటు

న్నామని సగౌరవంగా ఆహ్వానించడానికి బిజ్జల ప్రభువు మమ్మ పంపాడని చెపుతారు మన గూఢచారులు. దానివల్ల అటు గూఢ చర్యమూ నెరవేరుతుంది- తైలపుణ్ణి గూర్చి తెలుసుకోవచ్చు. ఇటు మన రాజ్యంలోని వీరశైవులూ బసవేశ్వరుడూ అంతా సంతోషపడు తారు. ఎలా వుంది నా సలహా?"

"ఓహోహో, నారాయణయ్యగారూ! అమోఘంగా వుంది అద్భుతంగా వుంది, పాదరసంలాగా వుంది. నారాయణాచార్యా! మీరు తరుచు రాజమందిరానికి వస్తూ వుండండి."

"చిత్తం. మీ అజ్ఞ కాదంటానా నేను? మీ క్షేమంకన్నా నాకు కావలసింది ఏముంది?"

# 17

కార్తీక పూర్ణిమ!

జ్వాలాతోరణం!!

కల్యాణనగరమంతా ఉత్సవాలతో వేడుకలతో నిండివుంది.

కొందరు నందికేశ్వర వ్రతాన్ని, కొందరు కేదారేశ్వరవ్రతాన్ని, మరికొందరు, ఉమామహేశ్వర వ్రతాన్ని- తమ తమ సాంప్రదాయాల ననుసరించి చేసుకున్నారు.

మహేశ్వరులంతా యధాశక్తి గణార్చనలు చేశారు.

వీరఖడ్గములు అనబడే సాహిత్యాన్ని చదువుతూ కొందరు హోమకుండాలలోకి దూకి నడుచుకుంటూ వెళ్ళారు.

మండే నిప్పుల వీరభద్ర పళ్ళాలు పట్టారు.

గుగ్గళకార్యము (వీరభద్ర ప్రస్తాయము) కొందరు చేశారు.

నాలుకలకు నారసాలు గుచ్చుకున్నారు. నందికోల నృత్యాలు చేశారు.

ప్రభాత పదములు, తుమ్మెద పదములు, ఆనంద పదములు, వాలేశు పదములు, పర్వత పదములు, వెన్నెల పదములు, నివాళి పాటలు పాడుతూ, కల్యాణనగర పురంధ్రీమణులు అనేక దీప నృత్యాలు చేశారు.

ఆనాడు అనుభవమంటపం ప్రత్యేక ఉత్సవ సమావేశం ఏర్పాటు చేసింది.

అధ్యక్షుడు అల్లమ ప్రభువుదేవర శూన్య సింహాసనాన్ని అధి రోహించాడు.

పక్కనే కార్యదర్శి చెన్నబసవన్న కూర్చున్నాడు.

మరొక పక్కన కాలచూరి రాజ్య ప్రధానమంత్రి అనుభవ మంటపానికి ఆత్మస్వరూపం- బసవేశ్వరుడు కూర్చొని వున్నాడు.

నగ్నసన్యాసిని అక్క మహాదేవి, అక్కనాగాంబిక, కల్యాణమ్మ ఇత్యాది శివశరణురాండ్రంతా ఒక వైపూ, మేదర చెన్నయ్య, డోహర కక్కయ్య, మడేలు మాచయ్య, శివనాగుమయ్య, కుమ్మరి గుండయ్య, ఏకాంత రామయ్య, ముగ్ధసంగయ్య, కిన్నెర బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, హరళయ్య, శీలవంతుడు మొద లైన వారంతా మరొకవైపూ ఆశీనులైనారు.

సభా కార్యక్రమాలు మాయాదేవి వీరశైవ నృత్యంతో ప్రారంభమైనాయి.

నృత్యానంతరం హారతి పట్టింది. వచనాలు గానం చేసింది.

"పయోధిఘనమే, పయోధికన్నను
పయోధి దాల్చిన పృథ్వి ఘనమ్మగు—
పృథ్విఘనమ్మె, పృథ్విని దాల్చిన
సహస్రఫణియగు శేషుడు ఘనమగు—
శేషుడు ఘనమే, శేషుని కన్నను

శేషముద్రి కాలంకృత భాసుర
మంజీర ఘలంఘల రావాంకిత
మహామహేశ్వరి పార్వతి ఘనమగు—
పార్వతి ఘనమే, పార్వతినే తన
సగముగ దాల్చిన శివుడు ఘనమ్మగు-
శివుడు ఘనమ్మే. శివుని దాల్చిన
శరణుని మనమది సర్వఘనమ్మగు—
శివునికన్న శివభక్తుడు ఘనమగు
స్వామీ కూడల సంగమదేవా!"

మాయాదేవిగానంలో అనుభవమంటపం పరవశమైవుండగా మంటప ద్వారం వద్ద కాపలా వున్న వీరభద్రశరణుడు ఘంటికను మోగించాడు. అంటే ఎవరో విశిష్ట వ్యక్తి అనుభవ మంటప సమావేశానికి వస్తున్నారని సూచన.

అంతా సింహద్వారం వైపు చూచారు.
అనుభవ మంటపంలోకి ఇరువురు వ్యక్తులు ప్రవేశించారు.
వారిని చూచి దిగ్భ్రాంతులైనారు.

మొదటి వ్యక్తి బిజ్జలుని మంత్రి మధువరసు! రెండవ వ్యక్తి లావణ్యవతి!!

వారిని చూడగానే చెన్నబసవన్న కార్యదర్శి హోదాలో ఎదురు వెళ్ళి స్వాగతం చెప్పాడు.

బసవేశ్వరుడు స్వయంగా మధువరసును వెంటబెట్టుకొని తీసుకొనివచ్చి తాను కూర్చున్న ఆసనం ఆయనకిచ్చి తాను వేరే ఆసనంపై ఆసీనుడైనాడు.

లావణ్యవతి వెళ్ళి మహిళా విభాగంలో కూర్చున్నది.

అంతా ఆశ్చర్యం నుండి ఇంకా తేరుకోలేదు. సభాధ్యక్షుడు అల్లమ ప్రభువు- తర్వాతి కార్యక్రమాలను కొనసాగించవలసిందిగా సూచన చేశాడు.

అప్పుడు బసవేశ్వరుడు లేచి "తరువాతి కార్యక్రమం గ్రంథా విష్కరణ" అని తానే పరిచయ వాక్యాలు చెప్పాడు-

"మూర్తి చిన్నదైనా కీర్తి గొప్పది. అనుభవమంటపానికి శరీరమూ ప్రాణమూ తానై నిలిచిన చెన్నబసవన్న రచించిన గ్రంథాలను ఈ పుణ్య సమయంలో ఆవిష్కరిస్తున్నామని తెలియ జేయడానికి ఆనందిస్తున్నాను."

అల్లమప్రభు దేవర చెన్నబసవని మూడు గ్రంథాలు 'షట్ స్థల సిద్ధాంతదర్పణం' 'చెన్నబసవ సాహిత్యం' 'లింగాంగ సామరస్య రహస్యం' అనే కృతులను ఆవిష్కరించాడు.

చెన్నబసవని గొప్పతనాన్ని గూర్చి హరళయ్య, శివనాగు మయ్య, సిద్ధ రామయ్య, ఏకాంతరామయ్యవంటి వక్తలు ప్రశంసిం చారు.

తరువాతి కార్యక్రమం కాకతీయ సామ్రాజ్యం నుండి మల్లి కార్జున పండితారాధ్యులను పిలిపిస్తూ బిజ్జలుడు పంపిన ఆహ్వానాంశం-

"మహాపురుషుడై ఆంధ్రదేశాన్ని ఉద్ధరిస్తున్న మల్లికార్జున పండితారాధ్యులవారు మన కల్యాణ నగరానికి రావడంకన్నా మానవ చరిత్రలో మరొక సువర్ణాక్షరాలతో లిఖింపదగిన సంఘటన ఉండదు. దీనితో ఆంధ్ర కర్ణాటక దేశాలను శాశ్వతంగా సాంస్కృతిక వారథి ఏర్పడుతుంది" అన్నాడు అల్లమ ప్రభువు.

"మల్లికార్జున పండితుని దర్శించుకోవడంకన్నా నా జీవితానికి పరమార్థం ఇంకేముంది?" అన్నాడు బసవన్న వినయంగా.

మడేలు మాచయ్య లేచి నిలబడి "అధ్యక్షా! నన్ను మాట్లాడనివ్వండి" అన్నాడు.

మాచయ్య అనుమతి లభించింది. అప్పుడు మడేలు మాచ దేవుడు ఇలా అన్నాడు-

"మీరంతా ఇందాకటి నుండి అప్పుడే మల్లికార్జున పండితారాధ్యుడు మన కల్యాణ నగరాన్ని పావనం చేసినట్లూ, తెలుగు వారి కాకతీయ సామ్రాజ్యమూ, కన్నడిగుల చాళుక్య సామ్రాజ్యమూ రెండు కలిసిపోయినట్లూ ఊహాగానాలు చేస్తున్నారు. అయితే నాకిందులో ఏదో రాజకీయ తంత్రమున్నదని అనిపిస్తున్నది.

బిజ్జలుడు శైవుడే! అయితే నిస్వార్థ పురుషుడు మాత్రం కాదు. తన సింహాసనానికి, పదవికి ఎవరు ఆటంకం వచ్చినా సహించడు. తన ప్రభువైన మూడవ తైలపుణ్ణి స్వయంగా కాకతీయ ప్రోలుని పైకి యుద్ధానికి పంపి, తైలపుడు కాకతీయుల బందీ కాగానే ఈ సామ్రాజ్యాన్ని తాను ఆక్రమించుకున్నాడు.

ఇప్పుడు కాకతీయుల మీదికి యుద్ధ ప్రయత్నాలు చేశాడు. అయితే శీలవంతుని శాంతియుత విప్లవాన్ని చూచి యుద్ధ ప్రయత్నాలు మానినట్లు ప్రకటించాడు. ఇది అసత్యమని నా భావం. ఇందులో ఏదో రాజకీయ తంత్రం ఉండి వుంటుంది. రాజగురువు నారాయణయ్య తంత్రం కావచ్చునిది. కాకతీయులను జయించాలనే కాంక్ష బిజ్జలునిలో లేదు. మల్లికార్జున పండితుణ్ణి పిలిపించాలని కూడా ప్రత్యేకంగా బిజ్జలునికి లేకపోవచ్చు. ఈ రెండూ రెండు రాజకీయపు ఎత్తులు.

బిజ్జలుని దృష్టి ఇప్పుడు మూడవ తైలపుని మీద కేంద్రీకృతమై వుంది. అతడు అనుమకొండలో యువరాజు సోమేశ్వరునితో సహా బందీ అయి వున్నాడు. వారిద్దరూ ఇప్పుడు బిజ్జలునికి కావాలి.

వారు జీవించి వుంటే ఎప్పటికైనా తన సార్వభౌమత్వానికి ప్రమాదం కలుగవచ్చు. అందుకని మల్లికార్జున పండితునికి ఆహ్వానం అనే పేర ఒక రాజకీయ బృందాన్ని ఓడుగల్లుకు పంపుతున్నాడని నేను ఊహిస్తున్నాను.

ఎటు తిరిగి నేను నిష్ఠురోక్తులు పలుకుతాననే పేరు రానే

వచ్చింది కాబట్టి, ఎవరికైనా కష్టం కలిగించే మాటలు అని వుంటే క్షమించండి" అన్నాడు మడేలు మాచయ్య.

అల్లమ ప్రభువు ఒక్క క్షణం ఆగి "మాచదేవా! తాత్వికంగా నీవు మహామహుడివి. ఆచరణలో మా అందరికంటేనూ ఘనుడివే! కాని మన ప్రభువులపై నీవిప్పుడు చేసిన ఆరోపణ కొంచెం తీవ్రమైనది. ప్రత్యక్ష సాక్ష్యం లేకుండా దీనిని నమ్మడం కష్టం" అన్నాడు.

అప్పుడు మడేలు మాచయ్య లేచి నిలబడి "అల్లమ ప్రభూ! నీవే శివునివి. నీకు భూత భవిష్యత్ వర్తమానాలు మూడూ తెలుసు. అయినా నన్నిలా ప్రశ్నించావంటే నా నోటితో ఈ విషయాలు అనుభవ మంటపంలోని సభ్యులందరికీ తెలియజేయాలని మీ సంకల్పం కావచ్చు. అలాగే చెపుతాను-

ఇక్కడికి నేడు కొందరు కొత్తవారు కూడా వచ్చారు కాబట్టి నా గూర్చి మరో రెండు మాటలు చెప్పుకోవలసి వుంది.

నేను స్వీకరించిన కాయకవ్రతం బట్టలు ఉతకడం. శివ శరణుల, శరణురాండ్ర బట్టలు ఉతికి వాటిని నా అర్చన కింద వారికి సమర్పించి ఆయాచితంగా వారిచ్చిన తృణమో-పణమో స్వీకరించి, దానిని తిరిగి జంగమార్చన చేయడం నా వ్రతం.

అంతేకాదు-ఉదయం బట్టలన్నీ ఉతికి స్నానం చేసి శివార్చన చేయకుండా నేను పర పురుషుని ముఖం చూడను. పరపురుషుడంటే శైవుడు కానివాడు. వివిధ మతస్థులు కలిగిన కల్యాణ నగరంలో ఇది సాధ్యంకాదని, తెల్లవారు జామునే లేచి గంట మోగించుకుంటూ నేను గుడ్డలు ఉతకడానికై చెరువుకు పోతాను.

ఈ ఘంటానాదం రక్షక భటులకూ, ఇతర నగర ప్రజలకూ పరిచితమే కాబట్టి, శివ పూజ జరిగే వరకూ ఎవరూ నా ఎదుట పడి ముఖం చూపించరు.

ఇలా వుండగా నిన్న నొక విచిత్ర సంఘటన జరిగింది. మామూలుగానే గుడ్డల మూటను భుజాన వేసుకొని తెల్లవారు జాము ననే ఇంకా కోడి కూయక ముందే, ఉషస్తార పొడవకముందే నేను చెరువుకు పోతున్నాను గంట వాయించుకుంటూ.

ఇంతలో చీకటిలో ఎవరో కదులుతున్నట్లనిపించింది. ఇటీవల ముసుగు మనిషి ఎవరో నగరంలో పిశాచాలను తిప్పుతున్నాడనే పుకారు వ్యాపించింది కదా। అందువల్ల ఇదేదో పిశాచమేనని అనుకున్నాను.

పిశాచమంటే లోకులు అనుకునే పిశాచం కాదు- దొంగ పిశాచం. దయ్యాలు భూతాలపైన నమ్మకంలేని మతాన్ని ప్రచారం చేసే బసవన్నగారి కాలంలో శివశరణులకు పిశాచాల భయమేమిటి?

'ఎవరు వారు?' అని ప్రశ్నించాను నేను. బదులు రాలేదు. 'శివశరణుడు మడేలు మాచయ్య కాయక వ్రతంలో బట్టలు ఉతికేందుకు వెళ్తున్నాడు-పాంధుడా! నీవు భవివో కాదో తెలియదు. పక్కకు తొలుగు' అన్నాను నేను.

ఈ మాటతో ఆ వ్యక్తి పక్కకు తొలగకపోగా నన్ను పట్టుకునేందుకు ప్రయత్నించాడు. నాపై తాళ్ళు విసరబడ్డాయి.

దానితో నేను గుడ్డల మూటను కింద పడేసి పెనుగులాడ సాగాను. వేగంగా ఆ వ్యక్తి నన్ను కట్టివేయడానికి ప్రయత్నించాడు.

తక్షణమే నేను నా బుట్టల మూటలో నున్న ఇనుప గూటాన్ని పైకి తీశాను. ఇది కత్తి వలె, గొడ్డలి వలె- కట్టెలు నరకడానికి, గుడ్డలు ఉడికించేటప్పుడు గరిటెవలె సహాయపడడానికి- రెండు ముఖాలతో ఉపయోగపడే సాధనం. ఆ ఇనుప గూటంతో ఆ వ్యక్తిని ఒక్క మోదు మోదాను. దెబ్బకు గిరికీలు తిరిగి కింద పడిపోయాడు.

దానితో చీకట్లో మరెవరో పారిపోతూన్నట్లు కూడా నేను గమనించాను. నేను పెద్దగా కేకలు పెట్టాను. రక్షకభటులు నాలుగు దిక్కులనుండి వచ్చారు.

రాత్రి కాపలాకాసే వారందరికీ నేను సుపరిచితమే. అందులో శరణులూ, మహేశ్వరులూ, వీరభద్రులూ కూడా ఉన్నారు.

"మాచదేవా! ఏమయింది?" అన్నారు.

"ఎవరో నన్ను బంధించి చంపాలని ప్రయత్నించారు. ఇనుప గూటంతో ఆత్మరక్షణ చేసుకున్నాను" అని వివరించాను వారితో.

వెంటనే ఒక వీరభద్ర భటుడు నాకు సహాయంగా చెరువుకు వచ్చాడు-నా వ్రతానికి భంగం వాటిల్లకూడదని.

బట్టలు ఉతికాను. శివార్చన చేశాను. తర్వాత నన్ను న్యాయ స్థానానికి తీసుకు పోయారు. ఇంకేం? బసవన్నగారంటే గిట్టని వర్గాలకు మంచి అవకాశం దొరికింది.

"మడేలు మాచయ్య తెల్లవారుజామున మనుషుల్ని చంపుతున్నాడు. అట్లా చంపడం కూడా భక్తిలో ఒక భాగమేనట" అని ఎగతాళిగా చెప్పారు రాజుతో.

బిజ్జలుడు ఆందోళన పడిపోయాడు. బిజ్జలునికి ఎవరు చచ్చారన్నదీ ఎవరు చంపారన్నదీ ముఖ్యంకాదు - రాజ్యంలో అందరినీ సంతోష పెట్టాలి. తన పాలన కెటువంటి ప్రమాదమూ రాకుండా చూచుకోవాలి- అంతే!

విచారణ జరుగుతుండగా రహస్య విభాగం నుండి సమాచారం వచ్చింది-నాచే చంపబడ్డ వ్యక్తి శాంతర వంశస్థుడైన పరదేశీయ సైనికుడని...."

మాచయ్య ఒక్కక్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

'శాంతర వంశస్థుడైన విదేశీ సైనికుడా!' అంతా ఆశ్చర్యపోయారు.

'ఔను- మన బిజ్జలుడు జయించిన రాజ్యాలలో జగదేవ దండనాయకుని రాజ్యం కూడా వుంది. జగదేవ దండనాయకుడు బిజ్జలుని చేతిలో పరాజితుడై పారిపోయాడు. అతడు శాంతర వంశస్థుడు. కాబట్టి జగదేవ దండనాయకుని వంశస్థుడైన ఈ సైనికుడు

గూఢచారిగా మన చాళుక్య రాజ్యంలో తిరుగుతున్నాడన్న మాట! ఇది నిర్ధారణ కాగానే బిజ్జలుడు మెత్తబడ్డాడు.

'ప్రభూ! శివశరణులు తప్పులు చేయరు. మాచయ్య అసలే చేయడు' అన్నాడు బసవేశ్వరుడు రాజుతో. ఆత్మరక్షణార్థం నేను చేసిన పనిని నేరం కాదని భావించి ప్రభువు నన్ను వదిలాడు నిన్న."

"ఇది మా కెవరికీ తెలియదే?" అన్నాడు శీలవంతుడు.

"తెలియనివ్వకుండా కట్టడి చేశాడు బసవన్న" అన్నాడు మాచయ్య. బసవన్న వినమ్రంగా గంభీరంగా నిశ్శబ్దంగా కూర్చొని వింటున్నాడు ఇదంతా.

"మొన్నటికి మొన్న విజయదశమినాడు బసవన్నపై హత్యా ప్రయత్నం- నిన్ననేమో మాచయ్య పైననా!?" అన్నాడు చెన్న బసవన్న ఆశ్చర్యంగా.

"ఈ శత్రువర్గాన్ని ఛేదించకపోతే ఏమి ప్రమాదాలు ముంచు కొస్తాయో ఊహించలేకుండా ఉన్నాను" అన్నాడు మాచయ్య.

అప్పుడు శీలవంతుడు లేచి "అల్లమప్రభు దేవరా! జగజ్యోతి బసవేశ్వరా! షట్స్థల చక్రవర్తి చెన్నబసవా! శరణు-శరణు! ఈ రహస్యాన్ని నేను ఛేదిస్తాను. నాకు ఆశీస్సులూ, అనుమతీ ఇవ్వండి. ఈ మహాకార్యంలో నాకు కలకేత బ్రహ్మయ్య తోడ్పడుతాడు" అన్నాడు శీలవంతుడు.

అనుభవ మంటప కార్యవర్గ సభ్యులు శీలవంతునికి ఈ బాధ్యత నివ్వడానికి అంగీకరించారు.

"ప్రధానమంత్రిగా నీకు నా సహాయం పూర్తిగా లభిస్తుంది. అయితే ఎవరినీ చంపకుండా, ఎవరినీ బాధించకుండా, శత్రువైనా సరే సోదరునిగానే భావించి, కేవలం రహస్య ఛేదనం మాత్రమే చేయాలి" అన్నాడు బసవేశ్వరుడు.

"అంటే-నేను శత్రువును చీకట్లో చంపానని ఆక్షేపణమా ఇది?" అన్నాడు మాచయ్య.

"మాచ దేవుడు శివస్వరూపుడు. శివుడు సృష్టి స్థితి లయ కారకుడు. కాబట్టి మీరుచేసే ఏ పనిలో అంతరార్థం ఏమిటో, మేము ఎలా చెప్పగలం తండ్రీ!" అన్నాడు బసవన్న.

బసవన్న మాచయ్యతో ఛలోక్తులాడుతున్నాడని సభ్యులు గ్రహించారు.

"నిజమే, నేను తెలియకుండానే ఆవేశంలో హింస చేశాను. దీనికి పరిష్కార మేమిటి?" అన్నాడు మాచయ్య.

"ఏముందీ? అహింసను చేయడమే" అన్నాడు బసవన్న.

"ఆఁ- ఆఁ! తరువాత కార్యక్రమం" అని గుర్తుచేశాడు అధ్యక్షుడు అల్లమ ప్రభువు.

"తరువాత నూతన సభ్యుల పరిచయం" అన్నాడు చెన్న బసవన్న.

"నూతన సభ్యునిగా నన్ను నేను పరిచయం చేసుకుంటాను" అని లేచి నిలబడ్డాడు మధువరసు.

"మహాజనులారా! నేను చాళుక్య రాజ్యపు మంత్రిగా మీలో దాదాపు అందరికీ తెలిసేవుంటుంది. కాని నేటి నుండి అనుభవ మంటప సభ్యునిగా ఇక లోకానికి తెలియబోతున్నది.

కుష్ఠురోగం రాబోయి హరళయ్య తీర్థంతో నయమైన నాటి నుండి, నాలో క్షీరసాగర మధనం జరుగుతున్నది.

హరళయ్యను అవమానించాను. హాలాహలం పుట్టింది-దానిని పుక్కిట పట్టాడు బసవన్న. ఇప్పుడు అమృతం ఉదయించింది- నా పాపపరిహారార్థం.

ఈ కార్తీక పూర్ణిమనాడు అనుభవ మంటపంలో అడుగు పెట్టాను. నన్నూ లావణ్యవతినీ ఈ వేదాంత మందిరంలో సభ్యులుగా చేర్చుకోండి" అన్నాడు మధువరసు.

చంద్రుణ్ణి చూచిన పాలసముద్రం వలె అనుభవ మంటప మంతా ఉప్పొంగిపోయింది, జయజయధ్వానాలతో మార్మోగి పోయింది.

"మన ఉద్యమం సాధిస్తున్న విజయాలలో ఇదొక ప్రముఖ ఘట్టం" అన్నాడు చెన్నబసవన్న ఆనందంగా.

"అడుగో - కాశ్మీరరాజు. తన సామ్రాజ్యం వదిలి మోళిగ మారయ్య అనే పేరు ధరించి ధర్మపత్ని సహితంగా కాయకష్ట వ్రతాన్ని స్వీకరించి 'శ్రమించనిదే భుజించే హక్కు లే' దనే మన

అనుభవ మంటప సిద్ధాంతం ప్రకారం కట్టెలు కొట్టడం వ్రతంగా స్వీకరించడంతో ప్రారంభమైన మన విజయయాత్ర, హరళయ్యను అవమానించిన మధువరసుగారే నేడు అనుభవ మంటపాన్ని అలంక రించడంతో ఒక విజయ ప్రస్థానాన్ని చేరుకున్నట్లే లెక్క" అన్నాడు చెన్నబసవన్న, మళ్ళీ కార్యదర్శి స్థాయిలో మాట్లాడుతూ.

"పూల దండలు గుచ్చడం నేటి నుండి నేను కాయకష్ట వ్రతంగా స్వీకరిస్తున్నాను" అన్నది లావణ్యవతి.

"బసవన్న నాకు ఇచ్చే ఏ కాయకష్ట వ్రతమైనా సరే ఆలో చించకుండా స్వీకరిస్తాను" అన్నాడు మధువరసు.

అనుభవ మంటపం మళ్ళీ హర్షధ్వానాలతో కరతాళధ్వనులతో మార్మోగిపోయింది.

అప్పుడు బసవన్న లేచి నిలబడ్డాడు. సభ నిశ్శబ్దమయింది.

"నేడు నిజంగా సుదినం. నా బంగారు కలలు ఫలిస్తాయన్న నమ్మకం నాకు కలిగింది. శ్రామిక గౌరవాన్ని సమాజ మంతా గుర్తించి, శ్రమించనిదే భుజించకూడదనే కాయక వ్రతంతో మొత్తం సమాజం శివానుభవాన్ని పొందిననాడు ఈ దేశంలో పాల నదులు పొర్లుతాయి-భూకైలాస మవుతుంది. రోగాలూ, దరిద్రమూ, హింసా, దోపిడీ-మానవ సమాజం నుండి పారిపోతుంది. సంగమేశ్వరా! మధు వరసు నేడు సభ్యుడిగా చేరడం కూడా నీ సంకల్పమే తండ్రీ!" అన్నాడు భక్త్యావేశంతో.

తర్వాత వేదాంత చర్చలూ, వచన సాహిత్య గోష్ఠులూ జరిగాయి. తన తల వెంట్రుకలతో శరీరాన్ని కప్పుకున్న నగ్న సన్యాసిని అక్కమహాదేవీ, బసవన్న అక్క నాగాంబికా- మంగళ హారతులు పాడారు.

సభా కార్యక్రమం ముగిసింది.

"ఇక మన కార్యక్రమం ఈ రాత్రి నుండే ప్రారంభమయింది. ఆ ముసుగు మనిషి సంగతేదో తేలిపోవాలి - పద" అని కలకేత బ్రహ్మయ్య శీలవంతుని చేయి పట్టుకొని ముందుకు నడిచాడు.

# 18

కలకేత బ్రహ్మయ్యా, శీలవంతుడూ- ఇద్దరూ ఆటవికుల వలె వేషాలు వేసుకున్నారు.

"నా ఉద్దేశంలో ఈ ముసుగుమనిషీ, ఈ దొంగలూ వీరంతా ఏదో పెద్ద రాజకీయ తంత్రంలో భాగస్థులేనని నమ్ముతున్నాను. అంతే కాక వీరి స్థావరం కూడా నగరానికి వెలుపల ఏ అరణ్యాలలోనో ఉండి వుంటుంది" అన్నాడు శీలవంతుడు.

"నీ వింకా ఊహాగానాలలోనే వున్నావు- నే నప్పుడే చాలా రహస్యాలు సేకరించాను- నా ఇంద్రజాల విద్యతో" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఏమిటవి?" అన్నాడు శీలవంతుడు.

"రేపు రాత్రి బిజ్జలుని ధనాగారాన్ని దోచుకోవాలని ముసుగు మనిషి వర్గం నిశ్చయించింది."

"నిజమా?" అన్నాడు నివ్వెరపోతూ శీలవంతుడు.

"ఔను" అని నవ్వాడు కలకేత బ్రహ్మయ్య.

"ఈ రహస్యం నీ కెలా తెలుసు? కొంపదీసి నీవే ఆ ముసుగు మనిషివి కావు కదా!" అన్నాడు శీలవంతుడు.

"నాకు ఒక ముసుగేమిటి? వేల ముసుగులున్నాయి. తలచు కుంటే క్షణక్షణం రూపాలు మార్చగలను" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఇంతకూ మనం ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలి?" అని ప్రశ్నించాడు శీలవంతుడు.

"నేను దారి చూపుతాను- నీవు సాహసంగా నడుస్తూ వుండు డింభకా! ధైర్యే సాహసే లక్ష్మీ" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

ఇరువురూ నడిచి నగరం వెలుపల వున్న శిథిల జైనాలయాల వద్దకు వెళ్ళారు.

పూర్వం ఈ జైనాలయాలు చాలా శోభగా వుండేవి. ఇటీవల

మత కల్లోలాలలో ఇవి ధ్వంసం చేయబడ్డాయి. ఇక్కడి వసతులూ నిర్మూలింపబడ్డాయి.

ఈ శిథిలాలలో పగిలిన తీర్థంకరుల విగ్రహాల చాటున ఇరువురూ కూర్చున్నారు.

"ఏమైనా కబుర్లు చెప్పు?" అన్నాడు శీలవంతుడు.

"మనం ఇప్పుడు మాట్లాడకుండా, చీమ చిటుక్కుమని కూడా అనకుండా ఎదురు చూడాలి" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

ఏమి ఎదురు చూడాలో, ఎందుకు ఎదురు చూడాలో వివరాలు చెప్పలేదు.

మొత్తానికి ఒక పగలూ, ఒక రాత్రీ శిథిల జైన మందిరాలలో పడిగాపులు పడివున్నా రిద్దరూ.

తెల్లవారింది- ఏమీ ఫలితం కన్పడలేదు.

"ఏమీ దొరకలేదే?" అన్నాడు శీలవంతుడు.

"ఎందుకు దొరకలేదు? నాలుగైదు పాము కుబుసాలూ, రెండు మండ్రగబ్బలూ" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఇప్పుడైనా నిజం చెప్పు? మనం ఇక్కడ ఎందుకు జాగరణ చేసినట్లు?" అన్నాడు శీలవంతుడు.

"ఎవరితోనూ చెప్పకూడదు."

"చెప్పను- ప్రమాణం."

"అయితే విను - మరణించిన శాంతార సైనికుని వద్ద ఒక లేఖ దొరికింది. దాని మీద కొన్ని బీజాక్షరాలు, కొన్ని బొమ్మలూ వున్నాయి. వాటి సంకేతార్థ మేమిటో ఎవరూ తెలుసుకోలేకపోయారు. కాని బసవన్న మాత్రం ఆ ఉత్తరాన్ని చదువగలిగాడు."

"అలాగా!" అన్నాడు శీలవంతుడు ఆశ్చర్యంగా.

"ఆ నాడు కనకశాసనం చదువలేదా - అలాగే! బసవన్న పురాతన శిలాశాసనాలూ, తామ్ర శాసనాలూ, బొమ్మల లిపులూ- చదవగలడు" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"బొమ్మల లిపులా?"

"ఔను. మనకు భాష పుట్టకముందు బొమ్మల లిపులే ఉండేవి. సూర్యుడంటే పగలు, చంద్రుడంటే రాత్రి, పాము అంటే సుఖంగా

వేయేండ్లు బ్రతకమని అర్థం, పడవ అంటే నదీ ప్రయాణం చేశారని సంకేతం. సింహం బొమ్మ నాయకత్వానికీ, గరుడుని బొమ్మ స్వస్థలం నుండి ఇతర ప్రాంతాలకు వెళ్ళారని చెప్పడానికీ అర్థాలు! ఇవన్నీ బసవన్న నాకు వివరించాడు.

అలాగే బీజాక్షరాలు కూడాను. శాంతార సైనికుని వద్ద దొరికిన లేఖలో ఒక వేణువూ, ఒక నగ్న ముని బొమ్మలున్నాయి. తర్వాత 'ఖం' అని ఒక అక్షరం వుంది. ఇంకేవో కొన్ని రేఖలు ఉన్నాయి. వాటిని పరిశీలించి బసవేశ్వరుడు 'వేణువు అంటే శ్రీకృష్ణుడు- నగ్నముని అంటే జైన మందిరాలు-'ఖం' అంటే కల్యాణ నగర ధనాగారాన్ని దోచుకోవడం' అని అర్థం చెప్పాడు. ఈ వివరణ కేవలం నాకే చెప్పాడాయన. ఇతరుల కెవరికీ చెప్పలేదు."

"బ్రహ్మయ్యా!" అన్నాడు శీలవంతుడు.

"నీవు బసవన్నగారి రహస్య విభాగ శాఖలో సభ్యుడివని నాకు ఇప్పుడు బాగా అనుమానం బలపడుతున్నది సుమా! ఈ ఇంద్రజాల విద్య కేవలం కాయకమే కాదు - గూఢచార్య రహస్యం కూడా నేమో!" అన్నాడు శీలవంతుడే మళ్ళీ.

బ్రహ్మయ్య నవ్వాడు- "నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు అనుకో- నేను ఎందుకు కాదనాలి. అన్నట్లు నీకీ వార్త తెలుసా?"

"ఏమిటి?"

"మడేలు మాచయ్య శాంతార సైనికుణ్ణి చీకట్లో ఆత్మ రక్షణార్థం చంపాడు కదా- అందుకని."

"దానికి నిరాహారదీక్ష చేయవలసి వస్తే మాచయ్య చేయాలి."

"కాదు- ఆ బాధ్యత బసవన్న తన బుజాల మీది కెత్తుకున్నారు. 'నా కల్యాణ నగరంలో ఎక్కడ హింస ఏ రూపంలో జరిగినా అందుకు నాలోనే ఏదో లోపం ఉన్నట్లు లెక్క. అందుకని హింసా పరిహారార్థం నేను ఉపవశించి ఆత్మ శుద్ధి చేసుకుంటాను' అంటాడు బసవన్న.

శీలవంతా! బసవన్న ఒక యుగపురుషుడు. బుద్ధుడు, వర్ధమాన మహావీరుడూ కలిపి ఒకేసారి జన్మిస్తే బసవన్న అవుతాడన్న మాట.

అయితే వారు ముక్తికై సంసారాన్ని త్యజించమన్నారు.
సంసారంలోనే ముక్తి, భూమి మీదనే కైలాసం అనేది బసవన్న ఆదర్శం" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

నగరం సరిహద్దులు వచ్చాయి. ఇరువురూ క్షణాల్లో మళ్ళీ తమ మామూలు వేషాలలోకి వచ్చారు.

"ఇప్పుడు మన కర్తవ్యమేమిటి?" అన్నాడు శీలవంతుడు.

"ఈ రాత్రికి బిజ్జలుని ధనాగారం దోచుకోవాలని పథకం వేయబడింది. అలా దోపిడీ చేసి ఆ నేరాన్ని బసవేశ్వరుని మీదికి తీసుకురావాలని కుట్రదారుల ప్రయత్నం. అందుకని రాత్రి మనం రహస్యంగా ధనాగారం వద్ద కాపలా కాయాలి. ఆ తరువాత పరిస్థితులు గమనించాలి" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

నగరం వచ్చింది. అంతటితో వీరి సంభాషణ ముగిసింది. ఏమీ తెలియనట్లు చెరొక దిక్కుకూ వెళ్ళిపోయారు.

పగలంతా శీలవంతుడూ, బ్రహ్మయ్యా యధా ప్రకారం తమ తమ నాయక వ్రతాలూ, లింగ జంగమార్చనలూ చేసుకున్నారు.

రాత్రి కొంచెం పొద్దు పోయిన తరువాత ధనాగారానికి కొంచెం దూరంగా పశువుల శాలవద్ద గడ్డి మోపులతో పడుకున్నారు మారు వేషాలలో.

ధనాగారం మట్టి కోటకూ, రాతి కోటకూ మధ్యలో వుంది. అది నిషిద్ధప్రాంతం- రేయింబవళ్ళు సాయుధులైన సైనికులు కాపలా కాస్తుంటారు.

హొన్నులూ, సువర్ణ నిష్కాలూ, ఇతర స్వదేశీ విదేశీ ద్రవ్య మారకానికి ఉపయోగించే నాణాలు ఇక్కడి టంకసాలలోనే తయారు చేయబడతాయి.

రాత్రి తెల్లవార్లూ శీలవంతుడూ బ్రహ్మయ్యా మేలుకునే వున్నారు.

అయినా ఏమీ ప్రయోజనం కన్పించలేదు. ఉషస్తార కన పడ్డాక తమ తమ గడ్డి మోపులు నెత్తిన పెట్టుకొని గొడ్ల కొష్టము నుండి ఇవతల పడ్డారు.

"ఏమి బ్రహ్మయ్యా! మరో రాత్రి నిద్రాభంగమయింది." అన్నాడు శీలవంతుడు.

బ్రహ్మయ్య కూడా అనుమానంలో పడ్డాడు. "అదే నేనూ ఆలోచిస్తున్నాను. బసవన్న దైవాంశ సంభూతుడు. ఆయన చదివిన బొమ్మల ఉత్తరానికి మరొక వ్యాఖ్యానం ఉండడానికి వీలు లేదు. లేకుంటే ఒక పొరపాటు జరిగి వుండవచ్చు...."

"ఏమిటి?" అని ప్రశ్నించాడు శీలవంతుడు.

"శాంతార సైనికుని వద్దనున్న లేఖ ప్రభువులకు దొరికిందన్న వార్త కుట్రదారులకు చేరగానే ఎందుకైనా మంచిదని వారు తమ వ్యూహాన్ని మార్చుకొని వుంటారు. ఈ విషయం మాత్రం మనం ఊహించలేకపోయాము. ఏది ఏమైనా, శీలవంతా! మనం జైన శిధిలాలపై ఒక కన్ను వేసి ఉంచవలసిందే. ఈ ముసుగు మనిషి కధకూ జైన శిధిలాలకూ చాలా దగ్గర సంబంధం వుంది" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

* * *

బ్రహ్మయ్య ఊహ నిజమేనన్నట్లు మరునాడు నగరంలో కొన్ని పుకార్లు వ్యాపించాయి-

బసవేశ్వరుడు బిజ్జలుని ధనాగారాన్ని యధేశ్ఛగా వాడుకుంటున్నాడని-ధనం నిల్వలు లెక్కలకు అందడంలేదని....

ఈ పుకార్లు చాలా ప్రబలంగా వ్యాపించాయి. కాని వీటిని సృష్టించినదెవరో మాత్రం అంతు దొరకడం లేదు.

ఎవరికి వారు 'ఫలానా వారు అనగా విన్నాను' అని అనే వారే!

"చూశావా! మన ఊహ నిజమే అయింది" అన్నాడు కలకేత బ్రహ్మయ్య శీలవంతుణ్ని కలుసుకొని.

"ఈ పుకార్ల సారాంశమేమిటి?" అని ప్రశ్నించాడుశీలవంతుడు.

"కుట్రదారులు ఒక వైపున ధనాగారాన్ని దోచుకోవాలనీ, రెండవ వైపున ఆ నేరం బసవన్న చేశాడని సమాజంలో ప్రచారం చేయాలనీ పథకం వేసుకున్నారు. అయితే శాంతార సైనికుడు హత్య చేయబడటంతో ధనాగారపు దోపిడీ వాయిదా పడింది. కాని

ఆపమని రెండవ వర్గం వారికి సమాచారం అందలేదు. అందువల్ల వారి పని వారు చేశారు. ధనాగారం దోపిడీ జరగకముందే ఇలా పుకార్లు వ్యాపించాయి" అని వివరించాడు కలకేత బ్రహ్మయ్య.

"అంతేకాదు-బసవన్న ప్రభుత్వ ధనంతోనే ఈ పుణ్య కార్యాలన్నీ నిర్వహిస్తున్నట్లు పుకార్లు వ్యాపించాయి. బిజ్జలుని ధనమంతా దోచి అనుభవ మంటప సభ్యుల కిస్తున్నాడట - అనుభవమంటపం వేదాంత మందిరంకాక బిజ్జలునికి వ్యతిరేకంగా కుట్రలు పన్నే కేంద్ర మట."

బ్రహ్మయ్య నివ్వెరపోయాడు. "అంతగా వచ్చాయా పుకార్లు?"

"ఆఁ! అనుభవ మంటపంలో మనం స్వేచ్ఛగా మతం-రాజకీయ విషయం-సంస్కృతి-సంఘర్షణలు అన్నీ చర్చించుకుంటాము కదా? అక్కడ జరిగే రాజకీయ చర్చలు బిజ్జలుని కూలద్రోయానికి జరిపే పన్నాగాలని పుకార్లు వ్యాపించాయి" అన్నాడు శీలవంతుడు.

కలకేత బ్రహ్మయ్య ఆలోచించాడు. "ఈ పుకార్లు వ్యాపింపజేసే వర్గాలలో కొందరు జైనులూ, బౌద్ధులూ ఉండవచ్చు. కొందరు శాంతార వంశస్థులూ ఉండవచ్చు. ఎందుకంటే మొన్న దొరికిన వాడు శాంతార సైనికుడు. శాంతార రాజ్యాన్ని బిజ్జలుడు ఆక్రమించి వారి రాజు జగదేవ దండనాయకుణ్ణి అడవులు పట్టించాడు.

వీరు కాక పశ్చిమ చాళుక్య వంశానికి నమ్మకస్థులైన వ్యక్తులు కూడా కొందరు ఉండి ఉండవచ్చు. ఎందుకంటే తైలపుణ్ణి కాకతీయుల మీదికి తోలిందీ బిజ్జలుడే! వారి చేత తైలపుణ్ణి, సోమేశ్వరుణ్ణి బందీ అయ్యేటట్లు చేసి. వారి పక్షాన తాను రాజ్యం ఏలుతున్నట్లు నటించి, శాశ్వతంగా తన కాలచూరి వంశస్థులను వివిధ విభాగాలలో ప్రవేశపెట్టి, పశ్చిమ చాళుక్య వంశస్థులనూ, తైలపునికి అనుయాయులుగా ఉన్న వారినీ- ఏవేవో కారణాలతో పదవీ భ్రష్టులను చేస్తున్నదీ బిజ్జలుడే!

అందువల్ల తైలపునికి అనుయాయులైన వర్గంవారు కొందరు ఇటు బిజ్జలుణ్ణీ- అటు బసవణ్ణీ విడదీసి రాజ్యంలో ఏదో రకంగా కల్లోలం సృష్టిద్దామని ఆలోచిస్తున్నారు."

శీలవంతుడు నివ్వెర పోయాడు- ఈవార్తలకూ, ఊహాలకూ కాదు- బ్రహ్మయ్య మేధోశక్తికి.

"బ్రహ్మయ్యా! నీవెంత తెలివైన వాడివి!" అని పైకే అన్నాడు ఆ మాట.

బ్రహ్మయ్య నవ్వి 'ఓరోరి శీలవంతయ్యా! ఇదంతా నా అపూర్వ మేధోశక్తి అనుకున్నావా? కాదు. ఇప్పుడు నేను చెప్పినవన్నీ మన అనుభవ మంటప కార్యదర్శి, షట్‌స్థల చక్రవర్తి అయిన చెన్న బసవన్న ఊహలు. ఆయన పరిస్థితులను చాలా చక్కగా అంచనా కట్టగలడు.

వ్యవహారం ఇలాగే సాగితే త్వరలో బ్రహ్మాండమైన విప్లవం వస్తుందని చెన్నబసవన్న ఊహిస్తున్నాడు."

"నిజమా...."

"దానిని నివారించడం కోసమే చెన్నబసవన్నా, ఇతర ప్రముఖులూ ప్రయత్నాలు చేస్తున్నారు. సొన్నలిగె మతానికి చెందిన సిద్ధ రామేశ్వర శివయోగి కూడా భక్తి మార్గం స్వీకరించి మన అనుభవ మంటప సభ్యుడై ఈ శాంతియుత పరిణామాలనే ప్రచారం చేస్తున్నాడు. ఇది మన శత్రువులకు కంటకంగా వుంది...." అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి?" అన్నాడు శీలవంతుడు.

"నేటి నుండి నీవు జైన శిథిలాలలో వసదులవద్ద మారు వేషంతో కనిపెట్టుకొని వుండు. నేను పశ్చిమాన వున్న తీర్థంకర మందిరం వద్ద కనిపెట్టుకొని వుంటాను. 'నగ్న ముని' అంటే ఈ రెండు ప్రదేశాలలో దేనికైనా సంకేతం కావచ్చునని బసవన్న ఊహించాడు." అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"కొండను తవ్వి ఎలుకను పట్టడం లేదు కదా" అన్నాడు శీలవంతుడు.

సంభాషణ అంతటితో ముగిసింది.

తిరిగి శీలవంతుడు, కలకేత బ్రహ్మయ్య తమ తమ నివాసాలకు వెళ్ళారు.

నిర్ణీత పథకం ప్రకారం ఇద్దరూ చెరొక వైపూ కాపువేసి ఉంచారు.

కలకేత బ్రహ్మయ్య జైన శిథిలాల వద్దా శీలవంతుడు తీర్థంకర మందిరం వద్దా దాగి వున్నారు.

అయితే ఈ సారి వీరి ప్రయత్నాలు వ్యర్థం కాలేదు.

# 19

బిజ్జలుడు అంతరంగిక మందిరంలో వుండగా రాజగురువు నారాయణయ్య వచ్చి ఆశీర్వదించాడు.

"అభివాదం నారాయణాచార్యా!"

"సకల సౌభాగ్య సిద్ధిరస్తు! ఏమిటో, ప్రభువులు ఆలోచనా నిమగ్నులైనట్లున్నారు"

బిజ్జలుడు పక్కనే మరకతములు పొదిగిన ఎత్తైన శిలాఫలకం పైనున్న ఒక పత్రాన్ని నారాయణయ్యకు అందించాడు. అదొక విజ్ఞాపన పత్రం. నారాయణయ్య దానిని పరిశీలించాడు. బసవేశ్వరునిపై ఆరోపణలు చేస్తూ కల్యాణ నగరం మంగళవాడ చుట్టూ వున్న మహాజన స్థలాలు, అగ్రహారాల నుండి ఎందరో యాజ్ఞీకులు చేసుకున్న వినతి పత్రమది.

మట్టిగె, మాణిక్యవల్లి. ఏలాపుర, కోలార్ వంటి అగ్రహారాల నుండే కాక బసవన్న జన్మస్థలమైన బాగెవాడి నుండి హింగుళేశ్వరం నుండి, అక్క నాగాంబిక అత్తవారిల్లైన కూడల సంగమేశ్వరం నుండి కూడా వేద విద్వాంసులు ఈ పత్రంలో సంతకాలు పెట్టారు. బసవన్న వర్ణ వ్యవస్థను విచ్ఛిన్నం చేస్తున్నాడనీ యజ్ఞయాగాదులు ఆగిపోయాయనీ దీనివల్ల ఇంద్రాది దేవతలు ఆగ్రహించి కల్యాణ నగరంపై ఇక వర్షింపదనీ అందులో వుంది.

"అటు ఆరవ విక్రమాదిత్యుడు, తైలపుడు వంటి చాళుక్య రాజులు, ఇటు తమ వంటి కాలచూరి ప్రభువులూ అంతా వర్ణాశ్రమా

లను పోషించిన వారే. యజ్ఞయాగాదులూ, అశ్వమేధాది మహా క్రతువులు జరిపించిన వారే. కాని బసవన్న వాటిని నిషేధించాడు. దీనివల్ల స్వర్గంలో దేవతలూ ఇటు భూదేవతలూ, చాళుక్య సామ్రాజ్యాన్ని ఆశీర్వదించలేదు." అని అందులో వుంది.

నారాయణయ్య చిరునవ్వుతో చదివి పత్రాన్ని తిరిగి మరకతోపల స్థగిత ఆసనం పైననే ఉంచి-

'ఇంతే కదా మరేమిటో అనుకున్నాను' అన్నాడు.

"అంటే- ఇదేమంత తీవ్రమైన విషయం కాదంటారా?" అన్నాడు బిజ్జలుడు.

"ఏమీ కాదు. బసవన్న దైవాంశ సంభూతుడు. సాక్షాత్తు నందీశ్వరుని అపరావతారం. ఆయన అనుగ్రహం మన సామ్రాజ్యానికి ఉన్నంతకాలం సప్త సముద్రాలు పొంగి వచ్చినా భయం లేదు. అటు ఆంధ్ర సామ్రాజ్యాలలో మల్లికార్జున పండితారాధ్యు డెంతటి వాడో ఇక్కడ బసవేశ్వరు డంతటివాడు" అన్నాడు నారాయణాచార్యులు బసవన్నకు జోహారు లర్పిస్తూ.

"అన్నట్లు ఆచార్యవర్యా! మీకీ పరిణామాలు తెలుసా? కాకతీయ రాజ్యంలో పాలకుడు మారిపోయాడట. ప్రోలరాజు వేయి స్తంభాల గుడిలో పడుకొని వుండగా ఆయన కుమారుడు రుద్రదేవుడు గుడికి వచ్చి చీకటిలో తన తండ్రినే ఎవరో శత్రు రాజుగా భావించి చంపివేశాడట."

"నిజమా?" నివ్వెరపోయాడు నారాయణాచార్యులు.

"ఔను. ప్రస్తుతం కాకతీయుల పాలకుడు రుద్రదేవుడు- మనం పంపిన గూఢచారులు ఈ వర్తమానాలను తీసుకొని వచ్చారు. తైలప్రభువును ఎలాగైనా కాకతీయుల నుండి విముక్తం చేసి ఆయన సామ్రాజ్యం ఆయనకు సమర్పించి హాయిగా నా బరువు బాధ్యతలను వదిలించుకోవాలని నా సంకల్పం. అంతకు మించి నా కిప్పుడు మరే కోరికా లేదు" అన్నాడు బిజ్జలుడు.

"ఔను. కర్తవ్య నిర్వహణలో మీరు రామాయణ భరతుని మించిపోయారు" అన్నాడు నారాయణాచార్యులు.

"కాని రాజ్యంలో మత పరిస్థితులు ఆందోళనకరంగా ఉన్నాయి. బసవేశ్వరుని సంస్కరణలు, ఆర్థిక విధానాలు ఎంత ప్రగతి దాయకమైనవైనా కొన్ని వర్గాలలో అసంతృప్తి చెలరేగుతున్నది. చివరకు ఆయన జన్మస్థలమైన బాగెవాడిలోని విప్రులు కూడా ఆయన నూతనోద్యమాన్ని వ్యతిరేకిస్తున్నారు" అన్నాడు బిజ్జలుడు.

"ఒక వైపు చాళుక్య సామ్రాజ్యానికి పరంపరాగతంగా స్వామి భక్తులుగా ఉన్న వారంతా, తమరు తైలపుణ్ణి శాశ్వతంగా నిర్మూలించి రాజ్యం స్వాధీనం చేసుకోవాలని కుట్ర పన్నుతున్నట్లు దుష్ప్రచారాలు చేస్తున్నారు. ఈ సనాతన మతస్థుల సంఖ్య కూడా తక్కువేమీ కాదు. వీరూ వారూ తోడైతే అశాంతి ప్రబలవచ్చు-" అన్నాడు చాలా నెమ్మదిగా నారాయణాచార్యులు.

"అదే నాకు భయంగా వుంది" అన్నాడు బిజ్జలుడు.

"బసవన్న, శివనాగుమయ్య, హరళయ్య, వంటి మాలవాళ్ళతో కలిసి తిరగడం వాళ్ళ ఇళ్ళల్లో భోజనం చేయడం కొందరికి నచ్చడం లేదు" అన్నాడు నారాయణాచార్యులు.

"మీకు నచ్చుతున్నదా?" అని ప్రశ్నించాడు.

"నచ్చకేం నచ్చకేం! బసవేశ్వరుడు దైవాంశ సంభూతుడు. అతడు చేసే ప్రతి పనికీ ఏదో అంతరార్థం ఉండే వుంటుంది. ఆయనది భక్తి మతం. భక్తికి కులాలూ మతాలు అక్కర లేదు." అన్నాడు నారాయణాచార్యులు.

బిజ్జలుడు కొన్ని క్షణాలు మౌనం పాటించాడు.

"అన్నట్లు మీకీ వార్త తెలుసా?" నారాయణాచార్యులు అన్నాడు.

"ఏమిటి?"

"మధువరసుగారు ఈ అనుభవ మంటపంలో సభ్యుడుగా చేరారు."

"నిజమా?" ఆశ్చర్యపోయాడు బిజ్జలుడు.

"బసవేశ్వరుని బోధలూ, క్రియాత్మకమైన ఆచరణా మధువరసు గారిని మార్చివేశాయి" అన్నాడు నారాయణాచార్యులు.

"అయితే నిజంగా ఇది విప్లవాత్మకమైన పరిణామమే" అన్నాడు బిజ్జలుడు.

"నిజంగా నా కెంతో ఆనందంగా వుంది ఇలా జరిగినందుకు, కాని...."

"కాని....?"

"అనుభవమంటపంలో సభ్యులుగా చేరుతున్నామని వివిధ దేశస్థులు వస్తున్నారు. మన చుట్టు పక్కల చోళ పాండ్య రాజ్యాల నుండే కాక సుదూర కాశ్మీర ప్రాంతాల నుండి కూడా సభ్యులు వస్తున్నారు. కాశ్మీర రాజు తన భార్యతో సహా వచ్చి అనుభవమంటపంలో చేరి, కట్టెలు కొట్టడం కాయకంగా స్వీకరించి బసవేశ్వరుని నూతన మతాన్ని, ఉద్యమాన్ని స్వీకరించాడు" అన్నాడు నారాయణాచార్యులు.

"ఔను. నేనూ విన్నాను ఈ విషయం."

"ఐతే వచ్చిన చిక్కల్లా వీరిలో ఎందరు నిజమైన భక్తులో ఎందరు గూఢచారులో తెలియడం లేదు."

"ఔను. ఆ విషయంలో మన జాగ్రత్తలు మనం తీసుకోవలసిందే!" అన్నాడు బిజ్జలుడు.

"బసవేశ్వరుడు తన లక్షా తొంభై ఆరువేల మంది జంగమ సైన్యంతో పోటీ రాజ్యం ఏర్పాటు చేస్తున్నాడనీ, అనుభవ మంటపం వారి పోటీ సామ్రాజ్యమనీ మన శత్రువులు ప్రచారం చేస్తున్నారు."

"అలాగా?" నివ్వెరపోయాడు బిజ్జలుడు.

"ఇందులో సత్యం అణు మాత్రం కూడా లేదనుకోండి. మనసా వాచా కర్మణా బసవన్న పదవిని తృణప్రాయంగా పరిగణించే వ్యక్తిత్వం కలవాడు-

అయినా లోకులు పలుకాకులు. చూశారూ....ఎలాగైనా మీకూ, బసవన్నకు మధ్య శత్రుత్వం పెట్టాలని చూస్తున్నారు. దానికి తోడు రాజధనం దుర్వినియోగ మవుతున్నదనీ, ధనాగారంలో ధనం లెక్కలకు అందడం లేదనీ మరొక పుకారు రాజ్యమంతా వ్యాపించి వుంది" అన్నాడు నారాయణాచార్యులు.

"ఔను గూఢచారుల ద్వారా నేనూ ఇది విన్నాను- బసవన్నను

పిలిచి అడిగాను కూడా! దానికి బసవన్న నవ్వి "రాజా! శివ శరణు లకు నీ ధనమెందుకు?

ఈశ్వరుడు ఐశ్వర్య కారకుడు. భక్తుల ధనం భక్తులకే ఇస్తున్నాను. శివభక్తియే చింతామణి- పశుపతి భక్తియే పరుసవేది-

క్షీరాబ్ధిలో క్రీడించే హంస చిన్న చిన్న మురికి గుంటలలో నీరు తాగుతుందా?

మామిడి రసాలు తాగే చిలుక బూరుగు పండ్లను కొరుకు తుందా?

పూర్ణిమా చంద్రుని జ్యోత్స్నను చప్పరించే చకోరం చీకటి కోసం ఆశపడుతుందా?

పద్మ సౌరభాన్ని గ్రోలే షట్పది బబ్బిలి పూలమీద వాలుతుందా?

మత్త గజాలు రాజ వీధిలోనే సాగుతాయి కాని, సందులలో గొందులలో దూరవు.

భక్తి రాజ మార్గం___

భక్తులకు ధనం శివుడే ఇస్తాడు" అన్నాడు బసవన్న అలా అని నా కళ్ళ ఎదుటే ధనాగారాన్ని అప్పటికప్పుడే తెరిపించి ధనాన్ని లెక్క బెట్టించాడు.

ధనంలో ఒక్క సువర్ణ నిష్కం కూడా తేడా రాలేదు." అన్నాడు బిజ్జలుడు.

"నేను చెప్పలేదా, బసవన్న దైవాంశ సంభూతుడని? ఆయ నను అనుమానించడం పరమ శివుడ్ని అనుమానించడమే" అని భక్తిగా రెండు చెంపలూ వేసుకున్నాడు నారాయణాచార్యులు.

"బసవని పై మీకు గల భక్తికీ, ఆదరానికీ నేను ఆనందిస్తు న్నాను" అన్నాడు బిజ్జలుడు.

"కాని ఒక్కటి మాత్రం ప్రజలకు నచ్చలేదు ప్రభూ"

"ఏమిటి?"

"చెన్న బసవన్న అంత శాస్త్రాన్ని ప్రదర్శించడం. రాము డంతవాటివాడిని, సీతాదేవి వంటి మహా సాధ్విని ఆడిపోసు కున్నారు- తాగుబోతులై మత్తెక్కి ఆ నాడు. అలాగే నేడూ మన రాజ్యంలో కొన్ని వర్గాలవారు ఇలా అంటున్నారు...."

"ఏమంటున్నారు-" బిజ్జలుడు ప్రశ్నించాడు.

"ఏదో అంటున్నారు లెండి- ఆ పాపిష్టి మాటలన్నీ నే నెందుకు మళ్ళీ అనడం."

"ఏమంటున్నారు?"

"ఎందుకులెండి- ఇంతకూ మల్లికార్జున పండితారాధ్యుల వారు కాకతీయ సామ్రాజ్యం నుండి...."

"నారాయణాచార్యా! మాట మార్చకండి. ప్రజలేమనుకుంటున్నారో నేను రాజుగా తెలుసుకోవలసిందే!"

"కొన్ని కొన్ని నీలాపనిందలూ, అభాండాలు పెద్దల ముందు అందులో ప్రభువుల ముందు చెప్పడం అసభ్యంగా వుంటుంది- అందుకని అలాంటి సురాపానోన్మత్తుల కూతలు మనం పట్టించుకోనక్కరలేదు."

"అసలు విషయం దాచి తక్కినవన్నీ చెపుతున్నారు. ఇంతకూ ప్రజలు అనుకుంటున్న అపవాదు లేమిటి?"

నారాయణాచార్యులు మాట్లాడలేదు.

"ప్రభువుగా ఆజ్ఞాపిస్తున్నాను. చెప్పండి నారాయణాచార్యా!"

నారాయణాచార్యులు వణికిపోయాడు.

"ఆజ్ఞ లెందుకులే ప్రభూ! చెపుతాను. కాని ఒక కోరిక- నేను చెప్పింది మీరు నమ్మకూడదు- రెండవది చెప్పినది చెప్పిన వెంటనే మరచిపోవాలి-"

"అలాగే- చెప్పండి."

"ఏమీ లేదు. బసవన్న...."

"ఊఁ- బసవన్న....?"

"బసవన్న తన లక్షా తొంభై ఆరువేల జంగమ సైన్యంతో చాళుక్య రాజ్యాన్ని స్వాధీనం చేసుకోవాలని అనుకుంటున్నాడట- చెన్న బసవన్న యువరాజు రాయ మురారికి సమ ఉజ్జీగా పోరాడటంలోని అంతరార్థమూ అదేనట.

ఒకవైపు ఈ ప్రయత్నాలు చేస్తూ రెండవవైపు శీలవంతుని వంటి అనుభవమంటప సభ్యులచేత శాంతి దళాలు నిర్మించి అహింస పేర రాజ్యాన్ని నిస్సైనికం చేయాలని ప్రయత్నిస్తున్నారట. దీనివల్ల

మీరు సైన్యాన్ని కోల్పోతే రాజ్యం తేలికగా వీరశైవులు స్వాధీనం చేసుకొని రాజుగా బసవన్నను...."

"ఇక ఆపండి." అన్నాడు బిజ్జలుడు కోపంగా- "అదే ప్రభూ! నాకూ ఈ నీలాపనిందలు విన్నప్పుడు ఇంతకన్నా ఎక్కువగానే క్రోధాగ్ని ఉదయించింది.

బసవన్న నిప్పులాంటివాడు.

నిప్పుకు చెదలుపట్టవచ్చునేమో కాని బసవన్నకు పదవీకాంక్ష మాత్రం లేదు. మీరు కలలో కూడా ఇలాంటి నీలాపనిందలకు చెవి ఒగ్గకండి.

వస్తాను ప్రభూ శలవిప్పించండి."

"నారాయణాచార్యా!"

"ప్రభూ!"

"నిప్పు లేకుండా పొగ పుడుతుందంటావా?"

"పుడుతుంది ప్రభూ! మంచు కరిగి ఆవిరి ఐనప్పుడూ పొగ వస్తుంది—"

"అప్పుడూ సూర్యరశ్మి నిప్పు కిందే లెక్క-"

"ఒక్కొక్కప్పుడు పొగ మంచు వ్యాపిస్తుంది. అదీ నిప్పు లేని పొగ క్రిందే లెక్క ప్రభూ! కాశ్మీరరాజు నిజంగా గూఢచారి కాదు. చాలా సాత్విక పురుషుడు. కట్టెలు కొట్టడం కాయకంగా స్వీకరించిన శివ భక్తుడు. అలాగే ద్రవిడ, చోళ, పాండ్య రాజ్యాల నుండి వచ్చిన భక్తులు కూడా—వారిని మనం అనుమానించ నక్కర లేదు ప్రభూ!"

"అయితే అనుభవ మంటపంలో స్వేచ్ఛగా రాజకీయప్రసంగాలు జరుగుతున్నట్లు గూఢచారులు వర్తమానాలు తెచ్చారే.." అన్నాడు బిజ్జలుడు.

"కావచ్చు, అది మన ప్రజాస్వామిక గౌరవాన్ని తెలియ జేస్తుంది. బిజ్జలుడు ఎంత జనరంజకుడో, అతని పాలనలో మంచి చెడ్డలు ప్రజలు ఎలా నిర్భయంగా చర్చించుకోవచ్చునో ఈ సంఘటన సాక్ష్యమిస్తుంది. అంతేకాని అనుభవ మంటపం కేవలం వేదాంత

మందిరమే ప్రభూ—మీరు కలలో కూడా అనుమానించ వలసిన అవసరం లేదు—అంతే! నా మాటల్లో మరే అంతరార్థమూ లేదు. వస్తాను ప్రభూ! శలవు తీసుకొంటాను."

బిజ్జలుడు ఆలోచనలో పడ్డాడు.

ఆ రాత్రి బిజ్జలుడు కడుపునిండా భుజించలేదు. పట్టమహిషితో హంసతూలికా తల్పంపై తృప్తిగా నిద్రపోలేదు.

## 20

ప్రదోష సమయం దాటింది. చిన్న చిన్న దీపాలు వెలిగాయి.

కళ్యాణ నగర వీధిలో ఒక సందులో చిన్న దుకాణం వుంది. అక్కడ అడపా తడపా ఒకరిద్దరు వచ్చి సరుకులు కొనుక్కొని పోతున్నారు.

ఒకతను సామాను కొనడానికి వచ్చిన రెండవ వాణ్ణి చూచి 'ఇవ్వాళ తిథేమిటి?' అని అడిగాడు.

"బహుళ దశమి"

"ఏమో! నిన్నటి చీకటి మాత్రం అమావాస్యలా అనిపించింది" అన్నాడు రెండవ వాడు.

"అవునుగాని, నువ్వుల ధర ఎందుకో ఇటీవల బాగా పెరిగి పోయింది" అన్నాడు రెండవ వాడు.

"అవును బాబూ పంట దెబ్బతిన్నది." అన్నాడు దుకాణ దారు.

"ఓ రెండు మర్రి ఆకుల ఇస్తళ్లు ఇవ్వు" అన్నాడు రెండవ వాడు.

దుకాణదారు మర్రి ఆకులతో కుట్టిన విస్తళ్లు ఇచ్చాడు.

"కొందరు మర్రి ఆకులు విస్తళ్ళల్లో భోంచేయరు. ఎందుకంటే దానిమీద విష్ణుమూర్తి పడుకుంటాడనిట!" అని నవ్వాడు రెండవ వాడు

"దుకాణదారూ నవ్వాడు.

"ఏమిటో గమ్మత్తుగా వుంటాయి నమ్మకాలు" అన్నాడు మొదటి వాడు,

"ఔను - మానవుడికి పిశాచాల మీద నమ్మకాలున్నాయి - కాని పిశాచాలను చూచినవాడెవడూ లేడు" అన్నాడు రెండవ వాడు.

"నేను చూచాను" అన్నాడు మొదటి వాడు.

"ఎక్కడ" అన్నాడు రెండవవాడు.

"ఎక్కడో అడవుల్లోనూ, పాడుబడ్డ గుళ్ళల్లోనూ చూచాను" అన్నాడు మొదటివాడు.

వ్యాపారికి పిశాచాల పేరు చెప్పేసరికి భయం పట్టుకుంది.

"దీపాలు పెట్టగానే దయ్యాల ముచ్చట లెందుకులే బాబూ-ఇవిగో మీ సరుకులు. హన్నులు ఇవ్వండి"

"ఏమయ్యా అంత భయపడతావ్" అని వ్యాపారి పిరికితనానికి వాళ్ళు నవ్వారు.

వ్యాపారం ముగిసింది. వాళ్ళిద్దరూ ఎవరి దోవన వాళ్ళు వెళ్ళి పోయారు.

ఈ వ్యాపారం జరుగుతున్నంత సేపూ ఇద్దరు బిచ్చగాళ్ళు దుకాణానికి ఎదురుగా అరుగు మీద కూర్చొని ఇది గమనిస్తూనే వున్నారు.

విస్తళ్ళు కొనుక్కున్న వ్యక్తి వెళ్ళిపోగానే బిచ్చగాళ్ళలో ఒకడు రెండవ వానితో.

"శీలవంతా! ఇప్పుడు జరిగినదంతా సాంకేతిక సంభాషణ! వీళ్ళిద్దరూ ఎటు పోతారో గమనించాలి. నీవు మొదటి వాడిని అనుసరించు. నేను రెండవ వాడి వెంట పోతాను. అర్ధరాత్రికి ముగ్ధ సంగయ్యగారి ఇంటి వద్ద కలుద్దాము" అన్నాడు.

వెంటనే కలకేతి బ్రహ్మయ్యా, శీలవంతుడూ దుకాణానికి వచ్చిన ఇరువురు వ్యక్తులనూ నీడల్లాగా అనుసరించారు. క్రమంగా అర్ధరాత్రి అయింది.

బ్రహ్మయ్యా, శీలవంతుడూ ముగ్ధ సంగయ్య ఇంటికి చేరారు. అప్పుడు వాళ్ళు బిచ్చగాళ్ళ వేషాలలో లేరు.

"ఏమయింది?" బ్రహ్మయ్య శీలవంతుణ్ణి ప్రశ్నించాడు.

"అతడు అలా వెళ్ళి వెళ్ళి నందికేశ రంగస్థలం వద్దకు చేరాడు. అప్పుడక్కడ క్షీర సాగర మథన యక్షగానం నడుస్తున్నది. అతదా

జన సమూహంలో కలిసిపోయాడు." బ్రహ్మయ్య తల వూపాడు.

"నీవు వెళ్ళిన పని?" అడిగాడు శీలవంతుడు.

"అదీ దాదాపు ఇలాగే అయింది. ఆ రెండవవాడు నగరం వెలుపల గుట్టల్లో మాయమైనాడు"

"ఇంతకూ జరిగిన దేమిటి?" శీలవంతుడు ప్రశ్నించాడు.

"ఆ దుకాణం కేంద్రమయ్యేది. అక్కడ వ్యాపారంతో పాటు ఏవో కొన్ని రహస్య కార్య కలాపాలు సాగుతున్నట్లు చెన్న బసవనికి వర్తమానాలు అందాయి. నా కా సంగతి చెన్న బసవన్న చెప్పాడు. అందుకని అక్కడ మనం కాపు వేయవలసి వచ్చింది. ఇప్పుడు చెప్పు శీలవంతా! వారి సంభాషణకు వ్యాఖ్యానం?"

"అలా అయితే ఆ వచ్చిన ఇరువురూ సాంకేతిక పదాలతో మాట్లాడుకున్నారు. నువ్వులు, మర్రి ఆకు విస్తళ్ళు, పిశాచాలు, అమావాస్య, అన్నీ సాంకేతిక పదాలే! అమావాస్యనాడు ఎక్కడో ఎవరో కలియాలని వారి సంకేతం. నువ్వుల శబ్దం తిలాంజలిని సూచిస్తుంది. అంటే ఎవరినో హత్య చేయాలని దాని భావం కావచ్చు. విష్ణుమూర్తి అనే మాట ఏదో పేరును సూచిస్తున్నది. మర్రి ఆకు, పిశాచాలు అన్న మాటలకూ వీరి రహస్య స్థావరాలకూ ఏదో సంబంధం వుండి వుంటుంది" అని వివరించాడు శీలవంతుడు.

"అద్భుతం! అచ్చం బసవన్న గారిలా వివరించావు రహస్య వ్యాఖ్యానం" అని పొగిడాడు కలకేత బ్రహ్మయ్య.

"ఇక పిశాచాలు పాడుబడ్డ గుళ్ళల్లో, అడవుల్లో వుంటాయి" అంటే శిథిల దేవాలయాలవద్దకు పిశాచాలు వస్తాయని దాని భావమన్న మాట!" అన్నాడు శీలవంతుడు.

"ఆ రావడం అమావాస్యనాడు జరుగుతుందని దాని అర్థం కావచ్చు" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఎవరూ బయట" అని లోపలి నుండి ముగ్ధ సంగయ్య పిలిచాడు.

"తలుపు తియ్- మహేశ్వరులం వచ్చాం."

ముగ్ధ సంగయ్య తలుపు తీశాడు.

శీలవంతుణ్ణి, కాలకేత బ్రహ్మయ్యనూ చూచి ఆనందించాడు.

ఆ అర్ధరాత్రే ఇరువురి హస్తార్చనా, పాదార్చన చేసి పాయసమూ విడెమూ సమర్పించాడు.

"ఏం సంగయ్యా! ఇంకా నిద్రపోలేదా?" అన్నాడు శీలవంతుడు.

ముగ్ధ సంగయ్య అనాథ. నా అనే వాళ్ళెవరూ లేరు- అనుభవ మంటప సభ్యులు తప్ప.

దానికితోడు సంగయ్య అమాయకుడు. లౌకికం తెలియని జడభరతుడు.

శివచరణులకు వక్కలు, ఆకులు, పత్తి-పత్తి, బిల్వమూ భస్మమూ అందజేయడం ఇతడి కాయకం.

"ఇదేమిటీ యిలా అర్ధరాత్రి వచ్చారు?" అన్నాడు ముగ్ధ సంగయ్య.

"మాకు మా ఇళ్ళల్లో తపస్సుకు భంగం కలుగుతున్నది సంగయ్యా! కొన్నాళ్ళు నీ యింట్లో తపస్సు చేసుకుంటాం. కాని నీ వెవరికీ చెప్పకూడదు" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"అమ్మతోడు-ఎవరికీ చెప్పను. బ్రహ్మయ్య నాతో ఉంటే యింకేం? ప్రతి నిమిషమూ ఇంద్రజాలం చూడవచ్చు" అన్నాడు సంగయ్య.

"సరేలే-ఇక పడుకుందాం!" అని అంతా పడుకున్నారు. శీలవంతునికీ, బ్రహ్మయ్యకూ నిద్రపట్టలేదు.

"రహస్య ఛేదనానికై తమకు కొన్ని స్థావరాలు కావాలి. ఒక స్థావరంనుండి చేసిన పని మరొక చోటినుండి చేయకూడదు. ఎప్పటికప్పుడే ఇక సమాచారాలు సేకరించి కార్యం నెరవేర్చుకోవాలి" అనుకున్నాడు బ్రహ్మయ్య.

"సంగయ్యా! నిద్రరావడం లేదు, ఏమైనా కబుర్లు చెప్పు" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"నిన్న నేనొక మహర్షిని చూచాను" అన్నాడు ముగ్ధ సంగయ్య.

"ఎక్కడయ్యోయ్"

"ఇక్కడే-కల్యాణ నగరంలో తూర్పున అక్కలవాడ లేదూ, అక్కడ"

అక్కడవాడ వేశ్యావాటిక.

"ఏమిటేమిటి? ఎలా వున్నాడా ఋషి?" ఆసక్తితో ప్రశ్నించారిద్దరూ.

"నేను పూజాద్రవ్యాలు సేకరించుదామని అటు పోతుంటే అక్కడ ఒక భవనద్వారంలో నాకొక మహర్షి కనపడ్డాడు. ఆయన జుట్టునంతా శివజటాజటంలాగా పైకెత్తి అందంగా ముడివేశాడు. ఆయన సున్నితమైన పట్టువస్త్రాలు ధరించాడు. శరీరమంతా బంగారు నగలతో అలంకరించుకున్నాడు. నన్ను పిలిచాడు. దగ్గరకు వెళ్లాను. ఆయనవద్ద మొగలిపూల సుగంధం వస్తున్నది.

శరీరమంతా తెల్లని భస్మం.

ముఖానికి ఏదో సువాసనతో కూడిన పచ్చని లేపనం. ఆయనా రుద్రాక్షలు ధరించాడు కాని, అవి మన రుద్రాక్షలవలె లేవు. ముత్యాలతో చేయబడిన దండలు. ఆయన నన్ను ప్రేమతో కౌగలించుకొని—"

"అఁ-కౌగలించుకొని" అన్నారు ఇద్దరూ కళ్ళు పెద్దవి చేసి.

"లోపలికి రా అన్నాడు-వెళ్లాను. అక్కడ ఆయన తపస్సు చేసుకునే మందిరంలోకి తీసుకొనిపోయాడు. ఆ గది మొత్తం చందనంతో, సాంబ్రాణితో సువాసనలు విరజిమ్ముతున్నది.

అక్కడొక సుదీర్ఘమైన పాన్పు వుంది. అది మల్లెపూలతో అలంకరింపబడి వుంది.

'మహర్షీ! అదేమిటి?" అని అడిగాను.

"ఇక్కడే నేను తపస్సు చేసుకుంటాను అన్నాడాయన నన్ను చూచి నవ్వి-" అన్నాడు ముగ్ధ సంగయ్య.

"ముగ్ధసంగయ్యా! అయ్యో నాయనా! వెర్రి కొడుకా! ఇంక చెప్పకు తర్వాత కథ-నిద్రపో, నిద్రపో" అన్నాడు కాలకేత బ్రహ్మయ్య. సంగయ్య నిద్రపోలేదు. తన కా ఋషి కొన్ని మధుర ఫలాలు తినిపించాడట. ఆ పండ్లు చెట్లకు కాయలేదట! మూనెలో నిప్పుతో వచ్చిన పంటలు!

"ఆహా! ఏమి తపస్సు-ఇద్దరం ఆ మంచంమీద తపస్సు చేశాము-అలాంటి తపస్సు నేనెప్పుడూ చేయలేదు" అన్నాడు ముగ్ధ సంగయ్య-

"బాబూ! సంగయ్యా ఈ తపస్సు ఇంకెవరికీ చెప్పకు. నిన్ను అనుభవ మంటపంలోకి రానివ్వరు" అన్నాడు శీలవంతుడు.

"నిజంగా ఆ ఋషి చాలా మంచివాడు శీలవంతా!"

"అయ్యో! అయ్యో! ఇంక నిద్రపో-ముగ్ధ సంగడూ!" ముగ్ధసంగయ్య నిద్రపోయాడు.

అప్పుడు శీలవంతుడు ఇలా అన్నాడు.

"మన మీ సంగయ్య యింటినొక స్థావరంగా చేసుకొని మన కార్యకలాపాలను సాగిద్దాము. ఎందుకంటే ఈ వెర్రిబాగులవాణ్ని ఎవరూ అనుమానించరు-ఇకపోతే, నేడు దశమి కదా! ఈ అమావాస్యకు శిథిల మంటపాలవద్ద ఏదైనా జరగవచ్చు. ఇరువురం చెరొక దిక్కునా కాపుందాము. నీవు జైనశిథిలాల వద్దనే ఉండు. నేను తీర్థంకర విగ్రహాలవద్దకు పోతాను" అన్నాడు శీలవంతుడు.

"అలాగే-అలాగే" అన్నాడు బ్రహ్మయ్య.

ఆ తర్వాత అంతా నిద్రపోయారు.

* * *

శిథిల జైన మందిరాలకు దాపులో కొన్ని సమాధులు ఉన్నాయి.

అమావాస్య నాడు చీకటిపడగానే ఆ సమాధుల నుండి రెండు పిశాచాలు గాలికి ఊగుతూ పైకి లేచాయి.

ఈ పిశాచాలకోసమే ఝున్నాళ్ళూ పడిగాపులు పడి కూర్చుని వున్నాడు కలకేత బ్రహ్మయ్య.

పిశాచాలలో బాటే తానూ క్షణంలో ఇంద్రజాల విద్యతో పిశాచ వేషం ధరించాడు బ్రహ్మయ్య. రెండు పిశాచాలు క్షణంలో ఒక పల్లకీని తెచ్చాయి. ఇంతలో ఒక ముసుగు మనిషి పల్లకీలో కూర్చున్నది-

పిశాచాలు ఆ మనిషి కళ్ళకు గంతలు కట్టడం బ్రహ్మయ్య చూచాడు.

ఆ తర్వాత పిశాచాలు పల్లకీని మోసుకుంటూ చీకట్లో కలిసి పోయాయి.

వారికి కన్పడకుండా కలకేత బ్రహ్మయ్య కూడా చీకటితో లీనమయినాడు.

కొంతసేపటికి పల్లకీ నందిసముద్రం చెరువుగట్టుకు చేరింది.

"ఐ-అ-అ"అని గట్టుమీది పిశాచాలు అరిచాయి. పల్లకీని దింపి ఈ పిశాచాళు కూడా 'ఐ.అ.అ' అని సమాధాన మిచ్చాయి.

దానితో పిశాచాలన్నీ గంతులు వేశాయి. ముసుగు మనిషిని నడిపించుకుంటూ భైరవుని కోన-లోపలికి వెళ్ళిపోయాయి.

మర్రిచెట్టు తొర్ర తెరుచుకున్నది.

ముసుగు మనిషి పిశాచాలూ తొర్రలో ప్రవేశించాయి. బ్రహ్మయ్యకూడా పిశాచరూపం దాల్చి ఆ గుంపులో కలిసిపోయాడు.

మెల్లగా వాళ్ళతోబాటే ఆ తొర్రలో ప్రవేశించాడు. సోపాత పంక్తీ, కాగడాలు వచ్చాయి-

పిశాచాలన్నీ నడుచుకుంటూ ముందుకు సాగాయి. సింహ ద్వారం వచ్చింది.

'ఐ-అ-అ-' అని పిశాచాలు అరిచాయి.

లోపలినుండి 'ఐ-అ-అ' అన్న సంకేతం వచ్చింది. పిశాచాలు కాగడాలూ, కొరువులూ నేలకానించాయి. దానితో తలుపులు తెరుచు కున్నాయి.

"పదమూడు పిశాచాలు, ఒక ముసుగుమనిషి-మొత్తం పదు నాలుగు". అన్నాయి పిశాచాలు,

"లెక్కబెట్టి లోపలికి వదలండి" అన్నాయి లోపలి పిశాచాలు.

కలకేత బ్రహ్మయ్య చిక్కులో పడిపోయాడు. చీకటిలో మెల్లగా సింహద్వారం పక్కనేవున్న భైరవుని విగ్రహం చాటున నక్కాడు.

లెక్కతో పదమూడు పిశాచాలు ఒక ముసుగు మనిషి లోప లికి వెళ్ళిపోయారు.

సింహ ద్వారాలు మూసుకున్నాయి.

కలకేత బ్రహ్మయ్య ఇప్పుడు అవస్థలో పడ్డాడు.

ముందు నుయ్యి, వెనుక గొయ్యిలా వుంది పరిస్థితి. ఇంతలో ఒక పిశాచం కాగడాతో సింహద్వారంముందు పహరా ఇచ్చి వెళ్ళిపోయింది.

బ్రహ్మయ్య సమీపంలోనే ఉన్న ఒక కాగడా పట్టుకొని తాను

పహారా తిరుగుతున్నట్లు ఆ భవనంచుట్టూ తిరగసాగాడు చీకట్లోనే.

ఇంతలో మొదట కాగడాతో పహారా తిరుగుతున్న పిశాచం ఎదురుపడి 'ఐ-అ-అ' అని అరిచింది. బ్రహ్మయ్యకూడా 'ఐ-అ-అ' అని సమాధానమిచ్చాడు. దానితో ఆ పిశాచం బ్రహ్మయ్యను ఏమీ అనుమానించకుండా ముందుకు వెళ్ళిపోయింది.

బ్రహ్మయ్య అక్కడి వాతావరణాన్ని శ్రద్ధగా పరిశీలించాడు-అక్కడ ఒక మూల అస్థిపంజరాలూ, కపాలాలు ఉన్నాయి. మరొక దిక్కున మండుతున్న కొరువులు ఉన్నాయి. బ్రహ్మయ్య ఆ భవనం చుట్టూ తిరిగాడు. ఇదేదో పురాతన శిధిల భవనంవలె కన్పడింది.

ఎవరో కావాలనే కట్టించుకున్న రహస్య భవనమని బ్రహ్మయ్య గ్రహించాడు.

ఇంతలో చీకట్లో ఏదో కదిలిన శబ్దమయింది. బ్రహ్మయ్య ఉలిక్కిపడి చూచాడు.

జరజర విషసర్పం ఒకటి పాకిపోతున్నది. బ్రహయ్య పక్కకు తొలిగాడు.

అది వెళ్ళి గోడవద్ద చుట్ట చుట్టుకున్నది.

కాగడాతో దానిని బ్రహ్మయ్య కాల్చివేశాడు.

ఇందాకటి గుంపుతో లోపలికి పోకపోవడం పెద్ద తప్పేనని బ్రహ్మయ్య గ్రహించాడు.

ఎలాగైనా లోపలికి పోవాలి

అందుకు మార్గమేమిటి??

చుట్టూ పరిశీలించాడు.

కాగడాతో తిరుగుతూనే భవనం వెనుక భాగానికి వెళ్ళాడు. అక్కడ బౌద్ధస్తూపం వంటి కట్టడం ఒకటి కనపడింది. దానికిపైన నల్లని ధ్వజం ఒకటి ఎగురుతూ వుంది.

బహూశా ఇది పిశాచ రాజ్య సంకేతమై ఉండవచ్చునని ఊహించాడు బ్రహ్మయ్య.

ఇంతలో బాగా మదించిన రెండు ఉత్తమ జాతికి చెందిన జాగిలాలు పెద్దగా మొరుగుతూ దూరంనుండి బ్రహ్మయ్య మీదికి దూకాయి.

బ్రహ్మయ్య చేతిలోని కాగడాను చల్లార్చి చీకటిలో కలిపి పోయాడు.

కాని కుక్కలు మాత్రం బ్రహ్మయ్యను వదలలేదు.

కొత్త మనిషిని వాసన పట్టాయా జంతువులు. ఇవేవో దయ్యపు కుక్కలు. చివరికి రాక్షస భైరవాలు నన్ను చీల్చేటట్లు న్నవి. అని భయంతో బ్రహ్మయ్య బౌద్ధస్థూపానికి ఎగబాకాడు. స్థూపానికి ఆనుకొని ఒక కొంద గుహవంటి భూభాగం ఉంది. కుక్కలు దిబ్బపైకి ఎక్కాయి. భైరవాల అరుపుకు కాపలావారు జాగరూకులైనారు.

కాగడాలతో నాలుగైదు పిశాచాలు బౌద్ధస్థూపం వద్దకు వచ్చాయి.

బ్రహ్మయ్య గుహవంటి భాగంలో దూరాడు. కేవలం మనిషి బోర్లా పడుకునేటంత చోటు మాత్రమే అక్కడ వుంది.

రెండు పిశాచాలు కాగడాలతో స్థూపం పైభాగాన్ని పరిశీలించాయి.

బ్రహ్మయ్య గుహసొరంగంలో బోర్లా పడుకొని అలాగే కొన్ని అడుగులు లోపలికి దూరిపోయాడు.

పిశాచాలు ఏమీ కనపడక వెనుకకు వెళ్ళిపోయాయి. కొరివి దయ్యాలు కూడా వెతికి వెతికి వెనుకకు వెళ్ళిపోయాయి.

గుహా సొరంగంలో బ్రహ్మయ్య అలాగే బోర్లా పడుకొని లోలోపలికి వెళ్ళాడు.

ఎంత వెళ్ళినా ఆ సొరంగం ఇంకా ముందుకు సాగిపోతూనే ఉన్నది.

బ్రహ్మయ్య ఇంకా ఇంకా ముందుకు పోయాడు.

ఇంకా సొరంగం లోపలికి పోతూనే వున్నది.

దాదాపు రాత్రి మొత్తం అలా ప్రయాణం చేశాడు. తెల్లవారు జామకు బ్రహ్మయ్యకు అలసట వచ్చింది. ఇక ముందుకు సాగలేక పోయాడు.

అలాగే సొరంగంలో కొంచెంసేపు కునికాడు.

తరువాత మెలకువ రాగానే సొరంగంలో అలాగే బోర్లా పడు

కొని పాకడం మొదలుపెట్టాడు. సొరంగం ఎత్తుగా పోతున్నది. ఇంతలో కాళ్ళకేదో మెత్తగా తగిలింది.

అది పాము.

బ్రహ్మయ్య చెకుముకి రాతితో వెలుగు చేశాడు. దేనినో తిని చుట్ట చుట్టుకొని పడుకున్నది.

సొరంగంలోని ఒక రాతితో దానిని చితక గొట్టాడు. పాము బ్రహ్మయ్య చేతులకు చుట్టుకొన్నది.

బ్రహ్మయ్య అలాగే కదలకుండా ఉండిపోయాడు.

అయితే, అప్పటికే దాని తల చితకడంతో నోట్లోని కప్పను వదిలేసింది.

పాము చనిపోయింది విలవిలా తన్నుకొని.

బ్రహ్మయ్య చేతికి చుట్టుకున్న తోక విడివడిపోయింది.

బ్రహ్మయ్య చెకుముకి వెలుగులో కప్పను మళ్ళీ పరిశీలించాడు. అది గోదురు కప్ప.

ఇది స్థూపంవద్ద నుండి లోపలికి ఇన్ని గంటలు ప్రయాణం చేసి దూరి వుండటం అసంభవం. కాబట్టి సమీపంలో ఎక్కడో జల వసతి వుండి వుండాలి. బ్రహ్మయ్య ఇంకా ముందుకుపోయాడు.

కాళ్ళకు, చేతులకు నీళ్ళూ బురదా తగిలాయి.

నీళ్ళల్లో ఈదుకొంటూ ఇంకా ముందుకు పోయాడు.

అక్కడ సొరంగం బాగా లోతుకు కిందికి దిగింది.

ఒక్క గెంతుతో అందులోకి దూకాడు.

మనిషి మునిగే లోతు నీరు-చేతులకు తామరపూలూ శైవలినీ అందుతున్నాయి. బ్రహ్మయ్య నీళ్ళల్లో మునిగి ఈదుకొంటూ ముందుకు సాగిపోయాడు. కప్పల బెకబెకలు, నురుగులు, ఏదో పెద్ద జల ప్రవాహం.

బ్రహ్మయ్య ఈదుకొంటూ ఇంకా ముందుకు పోయి నీళ్ళలో నుండి తలపైకెత్తి చూచాడు.

నంది సముద్రం చెరువు మధ్యలో ఉన్నాడు తా నిప్పుడు.

తూర్పున ఉషోరాగం కనపడుతూ వుంది.

# 21

అనుభవమంటపంలో సమావేశానికి వచ్చింది లావణ్యవతి.

ఆనాడు సమావేశంలో కాకతీయరాజ్యంలో జరిగిన మార్పులు చర్చకు వచ్చాయి. ప్రోలరాజు లింగైక్యం చెందాడనీ, ఆయన కుమారుడు రుద్రదేవుడు కాకతీయులకు ఇటీవల ప్రభువు అయినాడనీ, ఏ కారణం చేతనో రుద్రదేవుని పట్టాభిషేకానికి పాండ్య, చోళ, చాళుక్య, కాలచూరి రాజులకు ఆహ్వానాలు రాలేదనీ తెలియవచ్చింది.

“రుద్రదేవుడు కూడా వీరశైవుడే. రాజకీయమైన శత్రుత్వాలు ఎలా వున్నా మనది సాంస్కృతికమైన మిత్రత్వం” అన్నాడు అల్లమ ప్రభు దేవర అధ్యక్ష స్థానంనుండి.

ఆ తర్వాత మల్లికార్జున పండితారాధ్యుల గూర్చి చర్చకు వచ్చింది. ఆయన గుంటూరు మండలములో ధనదపురమని ప్రసిద్ధి కెక్కిన సనదవోలులో వెలనాటి చోడుని గురువైన బౌద్ధాచార్యుని ఓడించాడట. అక్కడినుండి అమరావతి వచ్చాడట. అమరావతికి వచ్చిన కొందరు కల్యాణనగరవాసులతో ముచ్చటించి అప్పటికప్పుడే కన్నడ భాషను నేర్చుకొన్నాడట.

“బిజ్జలుడు కూడా మమ్మల్ని కల్యాణనగరం రమ్మని ఆహ్వానం పంపాడు. బసవేశ్వరుని దర్శనం చేసుకోవాలని అనుకుంటున్నాను. నేనిప్పుడు అదే మార్గంలో వున్నాను. శ్రీశైలం మీదుగా కొద్ది నెలలలో కల్యాణ్ వస్తాను” అని మల్లికార్జున పండితుడు కబురు పంపినట్లు అమరావతినుండి తిరిగి వచ్చిన భక్తులు చెప్పారు.

బసవేశ్వరునితో సహా అంతా ఆనందపడ్డారు.

“కలకేత బ్రహ్మయ్య కనపడటం లేదేమిటి?” అని ప్రశ్నించాడు చెన్న బసవన్న.

శీలవంతుడు ఏదో చెప్పబోయి మళ్ళీ ఆగిపోయాడు.

“రాజ్యంలో మన శత్రువులు చేయరాని అన్యాయాలు చేస్తూ ఆ రాజ ద్రోహాలను మన నెత్తిపై వేసే ప్రయత్నాలు చేస్తున్నారు”

అన్నాడు మడేలు మాచయ్య.

"అంతా శివ పరీక్ష. బంగారం అగ్నిలో తప్తమైనప్పుడే చెల్లుబడి అవుతుంది. పరీక్షలలో నెగ్గినప్పుడే మన ఉద్యమమూ సత్యమూ ఈ కాలఖండాన్ని అతిక్రమించి జీవించగలుగుతుంది" అన్నాడు బసవేశ్వరుడు.

సమావేశానంతరం లావణ్యవతి అనుభవమంటపంనుండి ఇవతలికి వచ్చింది.

"బాచరసూ! నేను కొంచెం ఆలస్యంగా వస్తాను. వెళ్ళిపో" అని తన సారధిని ఇంటికి పంపివేసింది. అనుభవమంటపంలోనుండి శీలవంతుడు బయటకు వచ్చాడు.

"శీలా!"

"అమ్మాయిగారూ".

"అలా మొగలి తోటలోకి వెళ్దామా."

శీలవంతుడు లావణ్యవతిని అనుసరించాడు.

ఇరువురూ ఒక మొగలి పొద చాటున కూర్చున్నారు.

చంద్రోదయమైంది.

పుష్యమాసపు గాలులు చల్లగా వీస్తున్నాయి.

లావణ్యవతి సుతారంగా ఒక గడ్డి పూవును తీసుకొని మునిపళ్ళతో కొరికింది.

శీలవంతుడు ఏదో చెపుదామనుకున్నాడు.

మాటలు పెదవులదాకా వచ్చి ఆగిపోయాయి.

"ఏమిటి?" అని కనుబొమలతో ప్రశ్నించింది లావణ్య.

"ఏమీ లేదు" చిరునవ్వు నవ్వాడు శీలవంతుడు.

"ఏమిటో చెప్పరాదూ....?"

"ఏమీ లేదు అమ్మాయిగారూ....అక్క మహాదేవి మీకేదో ప్రత్యేక శిక్షణ నిస్తున్నట్లున్నది...."

"ఔను శీలా! పంచాచారములూ, అష్టావరణములూ షట్స్థల విచారమూ. సిద్ధాంత శిఖామణీ బోధిస్తున్నది....నేనూ మా నాయనగారూ త్వరగా శాంభవీ దీక్షను స్వీకరిస్తున్నాము."

శీలవంతుని కన్నులలో వెలుగులు కన్పడ్డాయి.

మొగలి పుప్పొడి గాలికి రివ్వున రేగి లావణ్యవతీ శీలవంతుల తలలపై అక్షతల వలె రాలింది.

మొగలి పొదల కవతలి కదళీ వనంలోనుండి ఓ పిల్లగాలి రివ్వున దూసుకుంటూ వచ్చి వారిరువురి చెవిలోనూ ఏవో గుస గుసలు చెప్పి పోయింది.

"దీనితో నేను పునర్జన్మ నెత్తినట్లువుతుంది. చాతుర్వర్ణముల లోని నా కులాన్ని నేను కోల్పోయి పరమేశ్వరుని గోత్రాన్ని సంగ మేశ్వరుని కులాన్ని స్వీకరిస్తానన్న మాట-మిగిలిన అనుభవమంటపం లోని సభ్యులవలెనే...."

"మీరప్పుడు నవజాత అవుతారు."

"అవును సుజాతను." అన్నది లావణ్యవతి నవ్వుతూ-ఆ నవ్వు మొగలి పువ్వుల లోపల సన్నటి పొట్టుతో పందెం వేసినట్లు న్నది.

గాలికి కదళీవనంలోని బీరపూలు ఊగి సువర్ణ నిష్కముల వలె పసుపు పచ్చని కాంతులు దిశలకు వెదజల్లాయి.

"అమ్మాయిగారూ-"

"శీలా!"

"నన్ను మీరు అపార్థం చేసుకోకుండా వుంటే ఓ మాట చెవుతాను."

"చెప్పు" అన్నది తన కాశ్మీర శాలువను తలపై చెవుల పక్కగా వల్లెవాటు వేసుకుంటూ.

"మీ రిప్పుడు కదళీ వనంలా ఉన్నారు అమ్మాయిగారూ!"

"అంటే"

"అంటే చిరుగాలికి రెప రెపలాడే లేత అరటి చెట్టు వలె ఉన్నారు మీరు. మీ కేశాలంకరణము నీలాంబరాల వలె, మీ కన్ను దమ్ములు చంద్రజ్యోత్స్నకు విరిసిన కలువలవలె, మీ దరహాసం దాసాని రేకుల కాంతివలె, మీ ఆత్మ అనుభవ మంటపం వలె, మీ శరీరం ఆకాశంలో తెలి మేఘములు విభూతి రేఖలై దోబూచులాడుతూ అలంకరించిన చంద్రకాంతి వలె ఉన్నారు-"

లావణ్యవతి నిండుగా నవ్వింది.

"ఇంక కవిత్వాలు ఆపు. నీవు కవనాన్ని నీ కాయక వ్రతంగా స్వీకరిస్తే బాగుండేది."

"నేనంత విద్వాంసుణ్ణి కాదు అమ్మాయిగారూ."

"గారూ అవి నాకు లేని పోని గౌరవాలు ఇవ్వకు."

"అది ఒకరు ఇచ్చే దేముంది? జన్మ సిద్ధంగా మీకు వచ్చిన గౌరవమే అది"

"ఆ జన్మ నా కెప్పుడో పోయింది. కులాలకు, మతాలకు అతీతమైన జన్మ అనుభవ మంటప సభ్యత్వంతో నాకు ఎప్పుడో లభించింది. శాంభవీదీక్ష అనేది ఇక అధికారక ముద్ర మాత్రమే" అన్నది లావణ్య వింజావళి చీరె కుచ్చెళ్ళు చలిగాలికి రెపరెపలాడు తుండగా.

"కాని....మన చుట్టూ వున్న సమాజం ఇంకా అంతకు ఎదగ లేదు." అన్నాడు శీలవంతుడు.

"ఆదర్శం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది. ఆచరణ ఎప్పుడూ కష్టంగానే వుంటుంది. ప్రారంభంలోనే మానుకొనే వారు కొందరు, మార్గం మధ్యలో జారుకునే వారు కొందరు, కడవరకు నడిచి కడలిలో హాలా హాలా వతరణం వద్దనే ఆగని వారికే అమృ తం లభిస్తుంది." అన్నది లావణ్యవతి.

అనుభవ మంటపంలో సంగమేశ్వర భజన కీర్తనలు గాలికి అలలు అలలుగా దిశాభాగాలలో ప్రసారమవుతున్నాయి.

దూరంగా గుడిగంటలు.

"శీలా"

"ఊఁ-"

"నేనొకటి సూటిగా అడుగుతాను చెప్పు"

శీలవంతుడు తల పైకెత్తి చూచాడు.

"నీకు నేనంటే ఇష్టమేనా?"

శీలవంతుడు నవ్వాడు.

"చెప్పు?"

"ఇష్టమంటే ఏమిటో చెప్పండి అమ్మాయిగారూ-మీపై గౌరవం వుంది-ఆరాధన వుంది-అంతకు మించిన ఆత్మీయత వుంది.

కులమతాల కతీతమైన ఒక నూతన వ్యవస్థ కోసం పరిశ్రమించే అనుభవ మంటప సభ్యత్వంలో మనకూ భాగస్వామ్యం వుంది-ఆ రీతిగా మీరంటే నాకెంతో ఇష్టం."

"అంతేనా? అంతకు మించి ఇన్నాళ్ళుగా నీవు మరే విధంగానూ అభిమానించలేదా?"

శీలవంతుడు ఒక్క క్షణం ఆగాడు.

"అమ్మాయిగారూ భగవంతుడు అవాఙ్మానస గోచరుడు అంటారు-అంటే మాటలకూ మనస్సుకూ అందడని దాని అర్థం-అలాగే కొన్ని భావాలు కూడా మాటలకూ మనస్సుకూ అందవు. మీరంటే నాకున్న అభిమానం ఇలాంటిది అని ఒక్కొక్కప్పుడు నిర్వచించడం కష్టమవుతుంది. ఎందుకంటే మనం ప్రతి విషయాన్ని సాపేక్షంగానే చూడగలం కనుక."

"ఒకవేళ నిరాపేక్షంగా చూడగలిగితే?" లావణ్య ప్రశ్నించింది.

"అప్పుడు లావణ్య స్థానంలో జాతి కుల మతాల నతిక్రమించిన ఒక శక్తి స్వరూపమూ, శీలవంతుని స్థానంలో బసవన్న శిష్యుడయిన ఒక పురుష ప్రకృతి మాత్రమే ఉంటుంది."

"అదే శీలా! నేను నీ నుండి ఆశించిన సమాధానం. బౌద్ధ మతం వ్యాప్తి చెందడానికి, మన ధర్మం వికసించకపోవడానికి కుల మతాలే కారణం."

"బౌద్ధం మాత్రం ఏమంత వికసించింది. స్త్రీకి స్వేచ్ఛనిచ్చింది. అహింసను పరమ వ్రతంగా స్వీకరించింది. కాని జననమే ఒక కష్టమనే, కోరికలే దుఃఖమూలమనే ఆ మతం నిర్వచించడంతో ఇటు కోరికలను జయించటం కోసం సంసారాన్ని వదిలీ, అటు కోరికలను అదుపులో పెట్టుకోలేక అడ్డదారులు తొక్కి బౌద్ధ భిక్షు, భిక్షుకీ గణం పతనం కావడం మన కళ్ళ ఎదుట చూస్తూనే వున్నాము కదా!"

"కోరిక అంటే ఏమిటి?" లావణ్య ప్రశ్నించింది.

"ప్రతిదీ ఒక కోరికే! ఒక స్త్రీని పురుషుడు కావాలనుకోవడం దగ్గరి నుండి భగవంతుణ్ణి జీవుడు కావాలని అనుకునే వరకు."

"కోరికలు నిర్మూలిస్తే?" లావణ్య అడిగింది.

"వద్దనే బసవేశ్వరుల వారు చెప్పారు. కోరికలను మన స్వాధీనంలో ఉంచుకోవచ్చు. పరిమితంగా నిగ్రహించవచ్చు-కాని నిర్మూలించకూడదని మాత్రం బసవన్నగారి ప్రవచనం"

'ఇంద్రియ నిగ్రహమేల చేసెదవు?"

పంచేంద్రియములు బాధ పెట్టవా?

సతి-పతి, రీతి సౌఖ్యంబు వదలిరా

సింధుభళ్ళాళ సిరియాళాదులు?' అది బసవన్న ప్రవచించారు."

"శీలా"

"ఊఁ-"

" నీవెందుకు వివాహం చేసుకోలేదు?"

"అమ్మాయిగారూ, ఆ ప్రశ్న నేనూ మిమ్మల్ని వేయవచ్చు కదా!"

"నాకా ఆలోచన లోగడ రాలేదు. మా నాయనగారు అ ప్రయత్నాలు చేయలేదు కనుక."

"నా విషయమూ అంతే! దానికి తోడు అనుభవ మంటప సభ్యుడినైన దగ్గరినుండి నేనొక ఆదర్శానికి అంకితమైనాను. ఆదర్శం జ్వలిస్తున్నప్పుడు వ్యక్తిగతమైన వాంఛలనే చలిగాలులు మనలను బాధించలేవు."

"వ్యక్తిగతమైన కోరికలు కూడా అదర్శాగ్నిని జ్వలింపజేసే ఇంధనాలే అయినప్పుడు...."

లావణ్య వేసిన ఈ ప్రశ్నకు శీలవంతుడు బదులు పలకలేక పోయాడు.

(ఇది అనుభవ మంటపం రెండవ భాగం)

'విజయ' జూలై నెల నవలానుబంధం

అనుభవ మంటపం (మూడవభాగం)

డా॥ ముదిగొండ శివప్రసాద్ రచన.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M135 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1to96 |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |